# మన పదులు

[భాగం 1]







రెంటాల గోపాలకృష్ణ




ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ

# ఇందులో....

గంగ

సింధు

బ్రహ్మపుత్ర

యమున

సరస్వతి

జీలం

# 1. గంగ

భారతదేశంలోని నదులలో గంగానది గొప్పది. ఈ నదిపేరు జగత్ప్రసిద్ధం. నదులన్నీ ఒకఎత్తు, గంగానది ఒక్కటీ ఒకఎత్తు. నదులలోకెల్లా శ్రేష్ఠమైనది గంగానది. దీనినిమించిన పుణ్యానది మరొకటి లేదు.

గంగానది హిమవత్పర్వతాల దక్షిణభాగంలో 13,800 అడుగుల ఎత్తున 'గంగోత్రి' అను హిమానీనదం వద్ద జన్మిస్తున్నది. దీని జన్మస్థానం 30°-55 ఉ. అక్షాంశ, 79°-7 తూ. రేఖాంశలమీద ఉన్నది. జన్మస్థానంలో దీనికి భాగీరథి అని పేరు. గంగానది గంగోత్రివద్ద పుట్టినదని చెపుతున్నప్పటికీ - వాస్తవానికి దీనిజన్మస్థానం, ఆ ప్రదేశానికి మరకొంచెం ఉత్తరాన ఉన్నది. స్వర్గంనుండి గంగను భూలోకంలోకి రప్పించడానికి భగీరథుడు గొప్ప తపస్సు చేశాడు. తత్ఫలితంగా గంగ దివినుండి భువికి దిగివచ్చింది. భగీరథుడు తపస్సుచేసినచోటు గంగోత్రికి దక్షిణాన సుమారు రెండుమైళ్ళదూరంలో ఉన్నదని చెపుతారు. ఆ ప్రదేశాన్ని బిందుసరోవరం అని పిలుస్తారు.

కేదారశిఖరంపైన మందాకిని అను నది పుట్టి, ఆగ్నేయదిశగా ప్రవహిస్తుంది. ఈ నదిని పశ్చిమగంగ, కలిగంగ అనికూడా పిలుస్తారు. కేదారం, హిమవత్పర్వ

రాలలో 33°.41' ఉ. అక్షాంశ, 70°.6' తూ. రేఖాంశలమీద 11,375'అడుగులఎత్తున ఉన్నది. ఇక్కడ శివుని పన్నెండు జ్యోతిర్లింగాలలో ఒకటియగు కేదారేశ్వరలింగం ఉన్నది. ఇది గొప్ప పుణ్యక్షేత్రం. శంకరాచార్యులు ఇక్కడే సిద్ధి పొందినట్లు చెపుతారు.

బద్రీనాథ్‌కు ఎగువన వసుధార అను జలపాతం నుండి అలకనంద అనే నది బయలుదేరి వస్తున్నది. మందాకిని, అలకనంద - ఇవి రెండూ 45 మైళ్ళతరవాత బద్రీనాధవద్ద రుద్రప్రయాగలో కలిసి, గంగానదిగా రూపొందుతున్నవి. మందాకినిలో స్నానంచేస్తే గొప్ప పుణ్యమని చెపుతారు. బద్రీనాథ్ హిమవత్పర్వత శిఖరాలలో ప్రధానమైనది. ఇది విశాలమైన గొప్ప పుణ్యక్షేత్రం. ఇక్కడ అనేక తీర్థాలు వెలసి ఉన్నాయి. బద్రీనాథ్‌కు కొంచెం ఉత్తరాన అలకనంద దక్షిణపుటొడ్డున బ్రహ్మ కపాలం ఉన్నది.

గంగాజలం పానంచేసినంతమాత్రాన సమస్త పాపాలూ పోతాయని మన పురాణాలు, ధర్మశాస్త్రాలూ చెపుతున్నాయి. అలాంటివారిదగ్గరికి యమదూతలు రాలేరని చెపుతారు. వేదాలేకాక, పురాణాలూ, ఇతిహాసాలూ - అన్నీకూడా గంగానది మహిమనుగురించి ప్రసిద్ధంగా వర్ణించి చెప్పాయి. గంగ ఎక్కడ ప్రవహిస్తుందో— ఆ ప్రదేశాలన్నీ పవిత్రమై పుణ్యక్షేత్రాలుగా భాసిస్తాయని

భారతం చెపుతున్నది. గంగాస్నానం, గంగాపానం, గంగాదర్శనం—ఇవన్నీకూడా పుణ్యాన్ని, మోక్షాన్ని చేకూరుస్తున్నాయి. గరుత్మంతుణ్ణి చూచీచూడగానే సర్పాలకు విషం హరించుకపోతుంది. అలాగే గంగను దర్శించగానే, సమస్తపాపాలూ పటాపంచలయిపోతాయి. చనిపోయిన వారి అస్థికలు, చితాభస్మం గంగలో కలుపుతారు. అందువల్ల వారు పుణ్యలోకాలకు పోతారు. గంగాతీరంలో—జప, హోమ, దాన, తర్పణాదులు—ఏదిచేసినాసరే–కోటిగుణితమై ఫలంవస్తుందని ధర్మశాస్త్రం. గంగాతీరాన పితరులకు శ్రాద్ధంపెడితే—పితృదేవతలు అనేకతరాలవారు తరిస్తారు. గంగాతీరంలో ప్రాణత్యాగంచేసినవాడు మోక్షానికిపోతున్నాడు. గంగాతీరాన లెక్కలేనన్ని పుణ్యతీర్థాలు, క్షేత్రాలు వెలసిఉన్నాయి. వీటినిగురించి వర్ణించడం సాధ్యంకాదు. మునులూ, మహర్షులూ—అందరూకూడా గంగాతీరాన నివసించారు. తపస్సులు చేశారు. యజ్ఞయాగాది క్రతువులెన్నో నెరవేర్చారు.

గంగను స్మరిస్తే పుణ్యం. గంగను దర్శిస్తే ఇంకా పుణ్యం. గంగాస్నానం అంతకన్నా పుణ్యం. గంగాజలపానం దానికంటే పుణ్యం. గంగాతీరంలో నివసించడం-అన్నిటికన్నా పుణ్యం. తులసీదళాన్నీ, గంగాజలాన్నీ—ఇస్తామంటే వద్దనకూడదు. ఆషాఢ, కార్తీక, మాఘ, వైశాఖపూర్ణిమలనాడు, మాఘ శుద్ధ సప్తమినాడు, అమావాస్య, సంక్రాంతి, సూర్యచంద్ర గ్రహణసమయాలందు

గంగాస్నానం అక్షయమగు పుణ్యం ప్రసాదిస్తుందని ధర్మశాస్త్రం. గంగాతీరంలో శివలింగాన్ని ప్రతిష్ఠించి— గంగాజలంతో అభిషేకించడం, బిల్వపత్రాలతో (మారేడు దళాలు) పూజించడం, గంగాతీరంలో భూదానం చేయడం అపరిమితమగు పుణ్యాన్ని తెచ్చిపెడతాయని చెపుతారు. గంగలో స్నానంచేసేటప్పుడు — జలాన్ని ఏవిధంగానూ మలినంచేయరాదనీ, మలినపదార్థాలు ఏమీ ఆ జలంలో విసర్జించరాదనీ, వస్త్రాలు ఉతకరాదనీ, అలాచేస్తే మహా పాతకం సంభవిస్తుందనీ అంటారు. అయితే గంగకు— అంటూ—సొంటూ లేదు. పరమపావనమైనదీ, నిర్మల మైనదీ గంగాజలం.

హిమాలయాలలో గంగోత్రినుండి బయలుదేరిన గంగానది—దక్షిణదిశగా సుమారు 500 మైళ్ళదూరం ప్రవ హించి, అటుపైన తూర్పుదిశగా సుమారు మరో వెయ్యి మైళ్ళదూరం పోయి— అనేక ఉపనదులను కలుపుకుని, తుదకు అనేకపాయలుగా చీలి, తూర్పునఉన్న బంగాళా ఖాతంలో పడుతున్నది. ఉత్తరప్రదేశ్‌లో సహారన్‌పూర్ జిల్లాలోని హరిద్వారంవద్ద గంగానది, మైదానాలలో ప్రవే శిస్తుంది. దీనిని హరిద్వారం, హరద్వారం అనికూడా అంటారు. ఇంతవరకూ సుమారు 200 మైళ్ళదూరం పర్వత ప్రాంతాలలో ప్రవహించిన గంగానది — ఇక్కడ ఒక బ్రహ్మాండమైన నదిగా రూపుతాల్చి మైదానభూమిలో ప్రవేశిస్తున్నది.

హరిద్వారాన్ని గంగాద్వారం అనీ, మాయాపురీ అనికూడా పిలుస్తారు. ఇది ప్రసిద్ధమగు పుణ్యక్షేత్రం. మోక్షప్రదాలని చెప్పబడిన సప్తపురాణాలలో మాయాపురీ ఒకటి. ఇక్కడ గంగ అనేకమార్గాలలో ప్రవహిస్తుంది. ఈ ప్రదేశంలో గంగానది వెడల్పు సుమారు ఒకమైలు. నదీతీరాన ఎన్నెన్నో ఘట్టాలు దేవాలయాలు ఉన్నాయి. భరద్వాజుడు ఈ గంగాద్వారంవద్దనే ఘృతాచిని చూచి .... ఆమెద్వారా ద్రోణాచార్యుడు అను పుత్రుణ్ణి పొందాడు.

ఇక్కడిదాకా వచ్చినతరవాత గంగ, భగీరథునితో 'ఇహ నన్ను ఏమార్గాన పొమ్మంటావు రాజా, చెప్పు?'-అని అడిగిందట. అప్పుడు భగీరథుడు, వాస్తుశాస్త్రంలో తనకు గల ప్రజ్ఞతో నదిని అనేకవిధాల మళ్ళించాడని చెపుతారు. హరిద్వారానికి రెండుమైళ్ళదూరంలో కనఖల్ ఉన్నది. కనఖల్ కూడా గంగాతీరమందలి ప్రసిద్ధమగు పుణ్యక్షేత్రం. హరిద్వారం, కనఖల్—ఇవి రెండూకూడా హిమాలయాలలో శివాలిక్ పర్వతపంక్తులమూలంలో ఉన్నాయి. హరిద్వారానికి 4 మైళ్ళ దూరంలో జ్వాలాపూర్ ఉన్నది. 24 మైళ్ళదూరంలో హరిద్వారంనుండి డెహ్రాడూన్ వెళ్ళే మార్గంలో హృషీకేశం ఉన్నది. ఈ మార్గంగుండానే యాత్రికులు గంగోత్రి, కేదారం, బద్రీనాథ్ వెడతారు. పన్నెండేండ్ల కొకసాటు బృహస్పతి కుంభరాశిలో ఉన్నప్పుడు హరిద్వారంలో కుంభమేళాఉత్సవం జరుగుతుంది.

ఆ సమయంలో దేశం నలుమూలలనుండీ లక్షలాది యాత్రి కులు వచ్చి ఇక్కడ గంగాస్నానంచేస్తారు.

జన్మస్థానంలో గంగానదికి భాగీరథి (భగీరథుని వలన తేబడింది) అని పేరు. తరువాత కొంతలెక్క జాహ్నవి అనేపేరుతోనూ, మందాకినీ—అలకనందలను కలుపుకున్న పిమ్మట గంగ అన్నపేరుతోనూ ప్రవహి స్తుంది. అలహాబాద్‌వద్దగల ప్రయాగక్షేత్రంలో గంగకు పశ్చిమదిశనుండి వచ్చిన యమునానది, అంతర్వాహిని అగు సరస్వతీనది గంగతో కలుస్తున్నాయి. ఇలా గంగా. యమునా, సరస్వతులు కలిసేచోటును త్రివేణీసంగమం అంటారు. ఇది గొప్ప తీర్థయాత్రాస్థలం. తరవాత పెద్దవీ, చిన్నవీ అనేక ఉపనదులు వచ్చి గంగతో చేరుతున్నాయి. వాటిలో ఉత్తరదిశనుండి వచ్చిన కర్నాలీ, గోమతి, సరయూ, ఐరావతి, గండకీ, కోసీ, బ్రహ్మపుత్రనదులు ముఖ్యమైనవి. ఇవి తూర్పుదిగ్భాగంలో గంగానదిని కలు స్తున్నాయి. దక్షిణదిశనుండి సోన్ అను మరొక ముఖ్య ఉపనది వచ్చి గంగలో కలుస్తున్నది. అయితే సము ద్రంలో కలిసేముందు సుమారు 250 మైళ్ళదూరంలో— గంగానది అనేకపాయలుగా చీలిపోయి—ఒక పెద్ద త్రికో ణాకారమగు డెల్టాను ఏర్పరచి, తూర్పుపాకిస్థాన్‌లోని గొలందోవద్ద బ్రహ్మపుత్రను కలుపుకొని-తుదకు బంగాళా ఖాతంలో పడుతున్నది. ఇక్కడ అసలునదిని పద్మానదిఅని పిలుస్తారు. బంగాళాఖాతంవద్ద మేఘనా అని పిలుస్తారు.

గంగానది మొత్తంపొడవు 1·514 మైళ్లు. గంగాసాగర సంగమం (గంగానది సముద్రంలో కలిసేచోటు) కలకత్తా నగరానికి దక్షిణాన సుమారు 90 మైళ్ళదూరంలో ఉన్నది. ఇది చాలా పవిత్రమైనస్థలంగా భావిస్తారు. కపిలమహర్షి ఆశ్రమం ఇక్కడే ఉన్నట్లు చెపుతారు. సగరపుత్రులు— అరవై వేలమందిని కపిలుడు భస్మంచేసింది ఈ ప్రదేశం లోనే. పాండవులు వనవాసంచేసేటప్పుడు—గంగాసాగర సంగమాన్ని దర్శించారు. ఈ క్షేత్రాన్ని గుహ్యకక్షేత్రమని పిలుస్తారు. మకరసంక్రాంతినాడు జనులు — ఇక్కడ మూడురోజులు స్నానాలుచేస్తారు.

కన్యాకుమారినుండి వెయ్యియోజనాల దూరంలో గంగానదిజన్మస్థానం ఉన్నట్లు చెపుతారు.

గంగానది అనేకపేర్లతో ప్రకాశిస్తున్నది.

'గఙ్గా విష్ణుపదీ జహ్నుతనయా సురనిమ్నగా భాగీరథీ త్రిపథగాత్రి స్రోతా భీష్మసూరపి'—అని అమరం.

హరిచరణాత్‌గాం భూమిం గతా గంగా—అని వ్యాఖ్య. హరిపాదంవలన భూమిని పొందినది గంగ. హరోత్తమాంగాద్భూమింగతా గంగా - హర శిరస్సువలన భూమిని పొందినది గంగ.

విష్ణుపదోద్భవావిష్ణుపదీ—విష్ణుమూర్తిపాదమందు పుట్టింది కనక, గంగకు విష్ణుపదీ అనుపేరు వచ్చింది. జహ్నోస్తనయా జాహ్నవీ — జహ్నుమహామునియొక్క చెవియందు పుట్టడంవల్ల జాహ్నవి అనుపేరు పొందింది.

సురాణాం నిమ్నగా సురనిమ్నగా — దేవతలనది కాబట్టి దీనికి సురనిమ్నగా అని పేరు. భగీరథేన రాజా భూలోక మవతారితేతి భాగీరథీ-భగీరథుడనే రాజుచేత భూలోకానికి తేబడిందికనక, భాగీరథీ అను పేరుతో ప్రసిద్ధిచెందింది. స్వర్గ మర్త్య పాతాళమార్గేషు త్రిషుగచ్ఛతీతి—త్రిపథగా-స్వర్గ మర్త్య పాతాళమార్గాలు- మూడింటియందూ పోతుంది కనుక, త్రిపథగా అని పేరు. స్వర్గంలో గంగకు ఆకాశ గంగ అనీ, మానవలోకంలో భూలోకగంగ అనీ, భూమి అడుగుభాగంలో పాతాళగంగఅనీ-పేర్లు. త్రీణి స్రోతాంసి యస్యాస్సా త్రిస్రోతాః—మూడుప్రవాహాలు కలది కాబట్టి త్రిస్రోతా అని పేరు. భీష్మం సూత ఇతి భీష్మసూః—భీష్ముణ్ణి కన్నది కాబట్టి భీష్మసూ అని పేరు. ఇలా గంగ యొక్క వివిధనామాలకూ ఒక్కొక్కదానికి ఒక్కొక్క ప్రసిద్ధమగు పురాణగాథ ఉన్నది.

విష్ణుమూర్తి వామనావతారం ఎత్తినప్పుడు— తన పాదంతో ఆకాశాన్ని కప్పివేశాడు. అప్పుడు బ్రహ్మ తన కమండలోదకంతో భగవంతునిపాదం కడిగాడు. ఆ జలమే గంగానదియై ప్రవహించింది. ఆవిధంగా విష్ణుపాదోద్భవ అనుపేరు వహించింది.

గంగ, లక్ష్మి, సరస్వతులు - విష్ణుమూర్తిభార్యలు. ఒకప్పుడు వీరు ముగ్గురూ భర్తదగ్గర ఉండగా గంగ, విష్ణుమూర్తివంక తదేకంగా చూడసాగింది. విష్ణువు చిరునవ్వు నవ్వి గంగను ముద్దాడాడు. అదిచూచి సరస్వతి

సహించలేకపోయింది. గంగను దూషించింది. గంగా సరస్వతులు తగవులాడుకుని-ఒకరినొకరు శపించుకున్నారు. ఆకారణాన గంగ, సరస్వతి—ఇద్దరూ నదులయినారు.

గంగ లోకంలో ఒక ప్రవాహంగా సంచరిస్తూ ఉండగా, శ్రీకృష్ణుడు ఆమెనుచూచి మోహించాడు. రాధాదేవి అది కనిపెట్టి శ్రీకృష్ణునితో నిష్ఠురోక్తులాడింది. అంతట గంగ రాధాదేవికి భయపడి—విష్ణుపాదాలు ఆశ్రయించి, ఆయనను శరణుజొచ్చింది. పిమ్మట బ్రహ్మాది దేవతల కోరికపై గంగకు ఎలాంటి భయం లేకుండాచేసి, విష్ణువు ఆమెను విడిపించాడు. అంతట బ్రహ్మ గంగా జలాన్ని తన కమండలంలో ఉంచుకుని వైకుంఠానికి తీసుకు వెళ్లాడు. శివుడు, గంగను తన శిరస్సున ధరించాడు.

అగస్త్యుడు సముద్రజలాలన్నీ పానంచేసి చుక్క నీరు లేకుండాచేశాడు. అప్పుడు గంగాజలంవల్ల మళ్ళీ సముద్రాలన్నీ నింపబడినాయి.

ఒకప్పుడు గంగ స్త్రీరూపంధరించి ఇంద్రసభకు వచ్చింది. అప్పుడు గాలికి ఆమె పమిట తొలగిపోయింది. అది కనిపెట్టి మహాభిషుడు గంగను కామవికారంతో చూచాడు. ఇదంతా బ్రహ్మ గమనించి—మానవలోకంలో పుట్టమని మహాభిషుని శపించాడు. అంతట గంగ—మనస్సులో మహాభిషునే తలచుకుంటూ భూలోకమార్గాన పోసాగింది. ఆ సమయంలోనే అష్టవసువులు వశిష్ఠుని వలన శాపంపొందినవారై ఆ మార్గాననే వస్తున్నారు.

గంగ వారిని కలుసుకుని మాట్లాడింది. వారివలన, మహాభిషుడు భూలోకంలో శంతనుడనుపేరుతో జన్మించాడని తెలుసుకున్నది. 'నీవు — శంతనమహారాజుని పెండ్లాడవలసినది. మేము ఆయనకు నీ గర్భాన పుత్రులమై జన్మిస్తాము' అని గంగతో చెప్పారు వసువులు. తనకోర్కె కూడా అదేకనక, సరేనన్నది గంగ — 'మరి మమ్మల్ని ఎక్కువకాలం మానవలోకంలో ఉంచకుండా — పుట్టిన వెంటనే నీళ్ళలో పడవెయ్యి. మేం తిరిగి స్వర్గానికి చేరుకుంటాం' — అని మళ్ళీ అడిగారు వసువులు. గంగ అందుకు సమ్మతించింది కాని — మీలో ఒకరుమాత్రం నాకు దీర్ఘాయుష్మంతుడగు కుమారుడుగా ఉండండి'- అని కోరింది గంగ. ఎనిమిదిమంది వసువులలో చివరివాడు అందుకు సరేనన్నాడు. అతడే ఆతరవాత వసువు అంశతో శంతనుడికీ గంగకూ పుట్టి, చిరకాలం జీవించిన భీష్మాచార్యుడు.

తరువాత ప్రతీపుడనేరాజు గంగాతీరంలో తపస్సు చేసుకుంటూఉండగా—గంగ అతని సద్గుణాలకు మెచ్చి, అతన్ని వరించింది. స్త్రీరూపంతో వచ్చి, అతని కుడితొడపై ఎక్కి కూర్చుని భార్యగా స్వీకరించమని వేడుకున్నది. కాని ఏకపత్నీవ్రతుడగు ప్రతీపుడు దానికి ఒప్పుకోక—'నీవు నా కుడితొడమీద కూర్చున్నావు కనుక, నా కుమారుడికి నీవు భార్యవు అవుతావు' అని చెప్పి వెళ్ళిపోయాడు.

ప్రతీపునికుమారుడు శంతనుడు. శంతనమహారాజు ఒకనాడు వేటకువచ్చి గంగాతీరంలో విహరించసాగాడు. అప్పుడు గంగ చక్కని యువతిరూపంలో అక్కడికి వచ్చింది. శంతనుడు ఆమెచక్కదనం చూచి మోహించాడు. అందుకు గంగ—'రాజా! నేను ఏంచేసినాసరే, నీవు ఊరుకోవాలి. నాకు అయిష్టమైనమాట ఏంమాట్లాడినా సరే—వెంటనే నేను నిన్ను విడిచిపెట్టి వెళ్ళిపోతాను'—అని చెప్పింది. శంతనుడు అందుకు సమ్మతించి గంగను పెండ్లాడాడు. శంతనునివలన గంగకు వసువులు పుత్రులుగా పుట్టారు. కాని పిల్లవాడు పుట్టినవెంటనే గంగ వానిని తీసుకుపోయి నదిలో పారవేస్తూవచ్చింది. శంతను డిది సహించలేకపోయాడు. కాని ఏదైనా అంటే ఆమె వెళ్ళిపోతుందన్నభయంతో ఊరుకున్నాడు. ఇలా గంగ, ఏడుగురు పుత్రులను నదిపాలుచేసింది. చివరకు ఎనిమిదవ వసువు పుత్రుడుగా పుట్టాడు. అప్పుడు శంతనుడు ఆ పిల్లవానిని చంపనివ్వనని అడ్డువచ్చి - గంగతో పరుషోక్తు లాడాడు. అంతట గంగ ఇహ తాను అతనివద్ద ఉండనని చెప్పింది. ఆ పిల్లవాడు అష్టవసువులలో ఎనిమిదవవాడనీ, ప్రసిద్ధుడవుతాడనీ చెప్పి— పిల్లవాడు పెద్దవాడయ్యేదాకా పెంచి—పిమ్మట శంతనునికి అప్పగించి తాను భూలోకం నుంచి వెళ్ళిపోయింది. ఆవిధంగా గంగా శంతనులకు జన్మించినవాడే భీష్ముడు.

ఇలా గంగనుగురించి అనేక పురాణాలలో అనేక గాథ లున్నాయి. అయితే, గంగానది భూలోకంలోకి రావ డానికి సంబంధించినకథ ప్రసిద్ధమైనది. గంగను భూలో కంలోకి తెచ్చినవాడు భగీరథుడు.

హిమవంతుడు పర్వతాలన్నిటికీ రాజు. మేరుపర్వత పుత్రియగు—మనోరమ అతనిభార్య. ఆమెయందు హిమ వంతుడికి ఇద్దరుకుమార్తెలు కలిగారు. పెద్దకుమార్తె గంగ, రెండవకుమార్తె ఉమ (పార్వతి). దేవతలంతా హిమవంతునివద్దకు పోయి త్రిపథగ అగు గంగానదిని తమకు ఇమ్మని అడిగారు. ధర్మాత్ముడగు హిమవంతుడు ముల్లోకాలకూ మేలుచేయదలచి, తన జ్యేష్ఠపుత్రిక అగు గంగను దేవతలకిచ్చాడు. దేవతలు గంగను తీసుకుని, దేవలోకానికి వెళ్ళిపోయారు. ఆవిధంగా గంగ దేవతానది అయింది. తరవాత హిమవంతుడు తన రెండవకుమార్తె పార్వతిని—ఆమె అభీష్టానుసారం శివుడికిచ్చి వివాహం చేశాడు. అయితే, శివవీర్యంవలన పార్వతియందు పుత్రుడు పుట్టినట్లయితే—అతన్ని లోకాలు భరించలేవని బ్రహ్మాది దేవతలంతా మిక్కిలి భీతిచెందసాగారు. వెళ్ళి శంకరుణ్ణి ప్రార్థించుకున్నారు. అప్పుడు శివుడు దేవతలకోరికపై తనరేతస్సును భూమిమీద విడిచిపెట్టాడు. అది భూమి యావత్తూ భయంకరంగా వ్యాపించింది. అప్పుడు దేవతలు భయపడి అగ్నిదేవుణ్ణి పిలిచారు. శివవీర్యం ధరించమని అతన్ని ఆదేశించారు. అగ్నిదేవునిచే వ్యాపించబడిన

శివరేతస్సు శ్వేతపర్వతం అయింది. తరవాత అతను దానిని భరించలేక—గంగలో విడిచిపెట్టాడు. కాని, గంగ కూడా సహించలేకపోయింది. తన ఒడ్డునఉన్న రెల్లు గడ్డిలో శివవీర్యం జారవిడిచింది. అందుండి కుమార స్వామి పుట్టి—కృత్తికలచే పెంచబడి—కార్తికేయుడను నామంతో ప్రసిద్ధిచెందాడు. దేవకోటికి సేనాపతి అయి నాడు. అంతట పార్వతి—'నా గర్భాన పుత్రుడు పుట్ట కుండా చేశారు'—అని దేవతలపై కోపించింది. 'నాలాగే మీ భార్యవలన మీకూ సంతానం లేకుండాపోవుగాక !'—అని దేవతలనందరినీ శపించింది. పిమ్మట భూమిని చూచి 'నీవు శివవీర్యం ధరించావు. నీ దుష్టబుద్ధికి ఫలితంగా నీవు అనేకమంది రాజులకు భార్యవు కాగలవు. నీకు ఎప్పుడూ పుత్రసంతోషం ఉండదు'—అని శపించింది.

అగ్నిదేవునివలన గంగయందు విడువబడిన శివ వీర్యం—గంగ తిరిగి విడిచివేసినందున అది భూమిమీద పడి, దానినుండి బంగారం, వెండిపుట్టినవి. రేతస్సుయొక్క మలం తగరంగానూ, సీసంగానూ మారింది.

ఇది ఇలాఉండగా, అయోధ్యాపట్టణాన్ని సగరుడనే చక్రవర్తి పరిపాలించాడు. ఆయన గొప్ప తపస్సుచేసి, అరవైవేలమంది బలాఢ్యులగు కుమాళ్ళను పొందాడు. ఆ సగరచక్రవర్తి అనేక అశ్వమేధయాగాలు చేశాడు. ఒకమాటు యాగాశ్వంవెంట తనకుమాళ్ళను అరవైవేల మందిని పంపించాడు. గుఱ్ఱం దేశదేశాలూ తిరిగి సము

ద్రంలో ప్రవేశించింది. వెంటనే సముద్రంఇంకిపోయింది. అది కనిపెట్టి-సగరునియజ్ఞం చెడగొట్టాలని ఆలోచిస్తున్న ఇంద్రుడు యజ్ఞాశ్వాన్ని దొంగిలించుకుపోయాడు. కపిల మహర్షి తపస్సుచేసుకుంటున్న ఆశ్రమంచెంత దానిని కట్టి వేశాడు. ఈ విషయం తెలియక సగరపుత్రులు భూమి అంతా వెదికారు. కాని యజ్ఞాశ్వం కనుపించలేదు. చివ రకు సముద్రాన్ని త్రవ్వడం మొదలుపెట్టారు. అలా అరవై వేలమంది సగరపుత్రులు అరవై వేలయోజనాల పొడవూ—వెడల్పూ గల సముద్రభూమిని త్రవ్వారు. సగరపుత్రులచే త్రవ్వబడినందున అప్పటినుంచీ సముద్రా నికి సాగరం అని పేరువచ్చింది. ఇంతచేసినా, వారికి యజ్ఞాశ్వం కనిపించలేదు. త్రవ్వగా త్రవ్వగా చివరకు రసాతలం కనుపించింది. అక్కడ మహాతేజస్సుతో వెలిగిపోతున్న కపిలమహామునినీ, ఆయనసమీపాన కట్టివేసి యున్న యజ్ఞాశ్వాన్ని వారు చూచారు. చూచి, అతనే గుఱ్ఱాన్ని దొంగిలించాడని తలచి ఆ మహామునికి అప కారంచేయడానికి పూనుకున్నారు. అంతట కపిలమహర్షికి కోపంవచ్చి కన్నుతెరిచాడు. తన తపోనిష్ఠకు భంగం కావించిన సగరపుత్రులవంక తీక్ష్ణంగా చూశాడు. ఆయన అలా చూచాడో లేదో—ఆ నేత్రాగ్నికి అరవై వేలమంది సగరపుత్రులు భస్మంఅయిపోయారు. ఆవిధంగా కుమా ళ్ళంతా నశించిపోగా, సగరుడు తన మనుమడగు అంశు మంతునికి రాజ్యం అప్పగించి స్వర్గస్థుడైనాడు. అంశు

మంతుడు—బూడిదరాసులుగా పడిఉన్న తన తండ్రులకు ముక్తి కలిగించాలని ప్రయత్నించాడు. కాని, అతనివల్ల కాలేదు. గంగానదీజలం అక్కడ ప్రవహిస్తేనేకాని—వారు తరించరు. గంగను భూమిమీదికి రప్పించడానికి అతనికి సాధ్యంకాలేదు. తరవాత అంశుమంతుని కుమారుడు దిలీపుడు రాజ్యానికివచ్చి—తాతలను ఉద్ధరించడానికి ఉపాయం వెదికాడు. కాని, అతనికీ చేతకాలేదు. అటుపైన దిలీపుని కుమారుడు భగీరథుడు రాజయినాడు. ఆయన మహాత్ముడు. ఆయనకు సంతానం లేదు. ఎలాగయినా గంగను భూమికి తెచ్చి అధోలోకంలో పడిఉన్న తన పితృదేవతలకు ముక్తికలిగించాలనీ, తాను సంతానవంతుడు కావాలనీ మిక్కిలి ఆరాటపడుతూవచ్చాడు. రాజ్యభారం మంత్రులకు అప్పగించి—వెళ్ళి ఎన్నోవేలసంవత్సరాలు భయంకరమైన తపస్సుచేశాడు. బ్రహ్మదేవుని మెప్పించాడు. బ్రహ్మ ప్రత్యక్షమై వరం కోరమన్నాడు.

బూడిదగా పడిఉన్న నా ముత్తాతలందరికీ నేను తర్పణం విడిచి ముక్తికలిగించాలి. అందుకుగాను గంగానదీజలం వారిభస్మంమీద ప్రవహించాలి. నా వంశం వృద్ధికావాలి—' అని అడిగాడు భగీరథుడు. అందుకు బ్రహ్మ 'నీవుకోరినవరం చాలా దుర్లభమైనది. గంగ, భూమిమీదకి రావడం కష్టం. అయినా, నీ కోరిక సిద్ధిస్తుంది. నీ వంశం వృద్ధిపొందుతుంది. గంగకనుక ఆకాశంనుండి ఎకాఎకీ భూమిమీదికి దూకితే,ఆదూకుడుకు భూమి భరించలేదు.

దానిని మధ్యలో ధరించి ఆపగల మహానుభావుడెవరో ఉండాలి. అందుకు శంకరుడొక్కడే సమర్థుడు. నీవు పోయి శంకరుణ్ణి ప్రార్థించి ఆయన అనుగ్రహం పొందు. గంగ, భూమిమీదికి వస్తుంది' అని చెప్పి గంగాదేవితో 'నీవు భగీరథుడు కోరినప్పుడు అతనివెంట వెళ్ల'—అని వచించి అంతర్థానమైనాడు. అంతట భగీరథుడు మరల తపస్సు ప్రారంభించాడు. రెండుచేతులూ పైకెత్తి—ఒక కాలిబొటనవ్రేలుపై నిలుచుని శివుణ్నిగూర్చి భయంకర మైన తపస్సుచేశాడు. శివుడు మెచ్చి, ప్రత్యక్షమైనాడు. గంగను తనశిరస్సున ధరిస్తానని చెప్పాడు. శివుడు అలా అనుగ్రహించగానే, భగీరథుని అభీష్టం తీర్చడానికి గంగా భవాని పూనుకున్నది. వెంటనే ఆకాశంనుండి మహా వేగంతో శివునిశిరస్సున దూకింది. అయితే, భగవంతు డగు శివుడు గంగకు గర్వభంగంచేయాలని సంకల్పించు కున్నాడు.

తనశిరస్సున పడిన గంగను, ఒక పెద్ద గుహతో కూడిన హిమవత్పర్వతంలావున్న తన జడలసమూ హంలో బంధించివేశాడు. ఆవిధంగా గంగ శివుని జటా మండలంలో చిక్కుపడి బయటికి రాలేక అనేకసంవత్స రాలు అక్కడే సుళ్ళుతిరుగుతూ ఉండిపోయింది. అప్పుడు భగీరథుడు — గంగానదిని కానక — మళ్ళీ అక్కడ భయంకరమైన తపస్సుచేశాడు. అంతట శివుడు సంతో షించినవాడై, తనజడలలో చిక్కుపడిన గంగధారను

బ్రహ్మదేవుడు నిర్మించిన బిందుసరోవరం అనే సరస్సులో విడిచాడు. అలా బిందుసరోవరంలో పడిన గంగ ఏడు పాయలై ప్రవహించింది. హ్లాదిని, పావని, నళిని అను మూడుప్రవాహాలు తూర్పుదిశగా ప్రవహించాయి. సుచక్షువు, సీత, మహానదిఅగు సింధువు— ఇవి మూడున్నూ పశ్చిమదిక్కున ప్రవహించాయి. మిగిలిన ఏడవగంగ భగీరథమహారాజును వెంబడించింది. భగీరథుడు దివ్యరథం ఎక్కి ముందు పోతూఉంటే-ఆయనవెంట వెళ్ళింది. గంగానది. అప్పుడు దేవతలూ, ఋషులూ-అందరూ గంగావతరణాన్ని చూచి, మిక్కిలి ఆనందంపొందారు. మహావేగంగా తెల్లని నురుగుకక్కుతూ, పెద్దపెద్దతరంగాలతో పైకిలేస్తూ, భయంకరమైన ధ్వనిపుట్టిస్తూ ప్రవహించింది గంగానది. ఇలా వెళుతుండగా మార్గమధ్యంలో మహాత్ముడగు జహ్నుడనే మహాముని ఒకచోట యాగంచేసుకుంటున్నాడు. గంగానది వెళ్ళి ఆయన యాగశాలనంతా ముంచివేసింది. దాంతో జహ్నువుకు కోపంవచ్చింది. గంగగర్వం అణచాలనుకున్నాడు. గంగాజలంఅంతా త్రాగివేశాడు ఆ మహానుభావుడు. అప్పుడు మళ్ళీ, భగీరథుడున్నూ, దేవతలూ, మునులున్నూ ప్రార్థించగా—జహ్నువు తన చెవులనుంచి గంగను బయటికి విడిచాడు. తరవాత గంగానది — సముద్రందాకా ప్రవహించి—అక్కడనుంచి పాతాళంలో ప్రవేశించింది. సగరపుత్రుల భస్మరాసులపై ప్రవహిం

చింది. వెంటనే అరవై వేలమంది సగరపుత్రులూ పాప విముక్తులై దివ్యదేహాలు ధరించి స్వర్గలోకం చేరుకున్నారు. భగీరథుడు వారందరికీ గంగాజలంతో తర్పణాలు విడిచాడు. ఆవిధంగా భగీరథునివలన గంగానది భూమిమీదికి తేబడింది. భాగీరథి అనుపేరుతో ప్రసిద్ధిపొందింది. జహ్నువు చెవినుండి బయటికి వచ్చి జాహ్నవి—అనుపేరుతోనూ— స్వర్గ, మర్త్య, పాతాళ మార్గాలలో పోయి— త్రిపథగ అనుపేరుతోనూ విలసిల్లింది. ఎవరికీ సాధ్యంకానికార్యాన్ని మహాకష్టంమీద ఎంతో ప్రయత్నంచేసి సాధించాడు భగీరథుడు. దీనివల్లనే 'భగీరథప్రయత్నం'—అను నానుడి ఏర్పడింది. ఇదీ ప్రసిద్ధమగు గంగావతరణ కథ. చదివిన వారికీ చదివించుచున్నవారికీ ఇహపరసౌఖ్యాలు కలిగించే పుణ్యకథ ఇది.

గంగావతరణకథ రామాయణం బాలకాండలో విశ్వామిత్రమహర్షి-శ్రీరామచంద్రుడికి విపులంగా వర్ణించి చెప్పాడు.

జహ్నుమహాముని చెవులనుండి గంగానది, జాహ్నవి అనుపేరుతో జ్యేష్ఠశుద్ధ దశమీమంగళవారంనాడు భూమిమీదికి వచ్చిందని చెపుతారు. ఆ పదిరోజులూ గంగాతీరంలో 'దశహర' అను ఉత్సవాలు జరుపుతారు. జాహ్నవి పదివిధాలయిన మహాపాతకాలను పోగొట్టు

తుందని అంటారు. గంగాతీరంలోగల అనేక పుణ్యక్షేత్రా లలో గంగోత్రి, కనఖల్, హరిద్వారం, ప్రయాగ, కాశీ, గంగాసాగరసంగమం — ఇవి ప్రధానమైనవి. గంగను గురించి ఋగ్వేదంలో చెప్పబడింది.

గంగానదినుండి అనేక కాలువలు త్రవ్వబడినాయి. ఈ కాలువలమూలాన ముఖ్యంగా ఉత్తరప్రదేశ్‌లోనూ, బీహారురాష్ట్రంలోనూ అనేక లక్షలఎకరాలభూమికి నీటి వసతి లభిస్తున్నది. హరిద్వారందగ్గరనుంచి త్రవ్విన గంగాకాలువ, నరోరావద్దనుంచి త్రవ్విన దిగువగంగా కాలువ — వీటివలన గంగా — యమునానదులమధ్య ఉన్న భూమి సాగు అవుతున్నది. గంగా — సింధుమైదానం మిక్కిలి సారవంతమైనది. ఇక్కడ కాలువలక్రింద వ్యవ సాయం ఎక్కువగా సాగుతున్నది. గంగానది సముద్రంలో కలిసేముందు అనేకపాయలుగా చీలి — విశాలమగు డెల్టా ఏర్పరచింది. ఈ డెల్టాభూమి మిక్కిలి సారవంతమైనది. గంగానది ఎక్కువభాగం సమతలమగు మైదానంలో ప్రవహించడంవలన — నౌకాయానానికిది ఎంతో అనుకూ లంగా ఉన్నది. గంగామైదానం ప్రపంచంలో సారవంత మైన మైదానాలలో ఒకటిగా ప్రసిద్ధిచెందింది. గంగా — బ్రహ్మపుత్రా డెల్టాతీరం పొడవు సుమారు 200 మైళ్ళు.

గంగానదిని మహాత్ములు, మునులే కాక, కాళి దాసు, శంకరాచార్యుడు, జగన్నాథపండితరాయలు —

మొదలగు మహాకవులు ఎంతో మనోహరంగా స్తుతిస్తూ కావ్యగానం చేశారు.

నదులలో శ్రేష్ఠమైనదీ, భారతీయులచే తల్లిగా భావించబడుతున్నదీ అయిన గంగానది— భారతదేశానికి సాటిలేని సంపద. పరమపావనమైన చరిత్ర గంగానదీ చరిత్ర.

*



# సింధు

మనదేశంలోని ముఖ్యనదులలో సింధునది ఒకటి. అంతేకాదు, నదులన్నిటిలోను పెద్దనది. ఈ నదిపొడవు సుమారు 1800 మైళ్ళు. ఇది హిమాలయపర్వతాల్లో వెనుక కైలాసపర్వత సమీపంలో టిబెట్‌లో 32 -0' ఉ. అక్షాంశ, 81 -0' తూ. రేఖాంశలమీద, మానసరోవరానికిదగ్గరగా సముద్రమట్టానికి సుమారు 17 వేల అడుగులఎత్తున జన్మి స్తున్నది. ఈ ప్రాంతంనుండే సింధునదికాక, సట్లెజ్, బ్రహ్మపుత్రానదులుకూడా బయలుదేరి వస్తున్నాయి.

సింధునది టిబెట్టునుంచి కొంతలెక్క వాయువ్య దిశగా ప్రవహించి, ఘర్ అనే మరొకనదిని కలుపుకుని, ఆపైన కాశ్మీరులో నంగపర్వతంవద్ద దక్షిణ దిక్కుగా వంపుతిరుగుతున్నది. కాశ్మీరులోనికి దిగినప్పుడు ఈ నది, సముద్రమట్టానికి సుమారు 13, 14 వేల అడుగులఎత్తునకు వస్తున్నది. బాల్టిస్థాన్‌లో దీనిఎత్తు సుమారు 8 వేల అడుగులు ఉంటుంది. లెహ్‌సమీపాన జస్కర్‌అను మరొక నదిని కలుపుకుని—తరువాత స్కర్దూ సమీపంగా ప్రవహి స్తున్నది. అటుపిమ్మట హారమోష్ పర్వతంప్రక్కనుంచి పోతున్నది. స్కర్దూవద్ద ఈ నదీమార్గం చాలా ప్రసిద్ధ మైనది. ఇక్కడే ఇది హిమాలయాలపశ్చిమభాగంనుండి

బయటికి వస్తున్నది. అక్కడనుంచి పంజాబ్‌లో అటక్ వద్ద మైదానంలో ప్రవేశిస్తున్నది. అటక్‌సమీపంలోనే కాబూల్‌అను మరొకనది వచ్చి సింధుతో కలుస్తున్నది. ఈ అటక్—సింధునదీ మార్గాన దాదాపు మధ్యలోఉన్నది. ఆతరవాత సింధునది పశ్చిమ పాకిస్థాన్‌గుండా ప్రవహించి కరాచీవద్ద అరేబియాసముద్రంలో పడుతున్నది. అటక్ దగ్గరనుంచి అరేబియాసముద్రంలో కలిసేవరకూ నది పొడవు సుమారు 910 మైళ్ళు. నది జన్మస్థానం టిబెట్‌లో 17000 అడుగుల ఎత్తునఉంటే, అటక్‌వద్దకు వచ్చేసరికి ఎత్తు సుమారు 2000 అడుగులకు తగ్గిపోయినది. ఇక్కడ నుంచి నది దక్షిణదిశగా ప్రవహిస్తున్నది.

హరహా అను ఉపనది, మఖడ్‌వద్ద సోహన్‌అను మరొక ఉపనది వచ్చి సింధునదితో కలుస్తున్నాయి. మిఠాన్‌కోటవద్ద—పంజాబునదులని ప్రసిద్ధిచెందిన—జీలం చీనాబ్, రావి, బియాస్, సట్లెజ్ అనే అయిదునదులూ వచ్చి సింధునదిలో కలుస్తున్నాయి. ఈ అయిదునదులూ ప్రవహించే ప్రదేశానికే పంజాబ్ అని పేరు. ఇవి సింధు నదికి తూర్పుదిక్కుగా—అయిదువ్రేళ్ళలాగా విస్తరించి ఉన్నాయి. ఈ నదులన్నీ ఒకదానికొకటి చేరువగా ఉన్నాయి. ఇవి హిమాలయపర్వతాలలో పుట్టినందున, వేసవిలో మంచుకరిగి వరదలు వస్తుంటాయి. ఇవి వానా కాలంలోనూ ఎండాకాలంలోనూకూడా జలసమృద్ధమై ఉండే జీవనదులు. సింధునది పంజాబునదులతో కలిసే ప్రదేశ

మగు ఓితాస్‌కోట సముద్రానికి 970 మైళ్ళ దూరాన, సముద్రమట్టానికి సుమారు 260 అడుగులఎత్తున ఉన్నది.

సింధునదికే ఇండస్ అనుపేరుకూడా ఉన్నది. సింధు—అందే అసలు — సముద్రం అని అర్థం. పూర్వకాలంలో జనం మొట్టమొదట ఈ మహానదిని చూచి నప్పుడు భయంతో కంపించిపోయారట. అనేక ఉపనదు లతో - ఎటుచూచినా బ్రహ్మాండంగా జలమయమై కనిపించి నందున - ఇదేదో మహాసముద్రం అనుకుని - సింధు— అని పిలిచారట! ఆవిధంగా దీనికి సింధునది అని పేరు వచ్చిందని చెపుతారు. ముఖ్యంగా బక్కారుదగ్గరనుంచి ఈ నది సింధునది అను పేర ప్రసిద్ధివహించింది. సంస్కృతశబ్దమగు 'సింధు' నుండే 'ఇండస్' అను పేరు పుట్టినట్లు తెలుస్తున్నది. గ్రీకుభాషలో ఈ నదిపేరు సింధోస్ అనీ, లాటిన్‌లో సిండస్ అనీ చెపుతారు. సింధు — లేక ఇండస్ అనేదానినిబట్టే, మనదేశానికి ఇండియా అనీ, ఇక్కడ నివసించే ప్రజలను హిందువు లనీ పేరువచ్చినట్లు తెలుస్తున్నది. ఇది ఎక్కువభాగం పాకిస్థాన్‌లోని పంజాబు, సింధు రాష్ట్రాలగుండా ప్రవహి స్తున్నది. సింధునది ప్రవహించే ప్రదేశానికి సింధురాష్ట్రం అనీ, సింధుదేశమనీ పేర్లువచ్చాయి.

సింధునది చాలా ప్రాచీనమైనది. ఋగ్వేదం సప్తసింధువులను పేర్కొన్నది. సింధునది, పంజాబునను

లని చెప్పబడే అయిదునదులు, సరస్వతీనదీ - ఈ ఏడు నదులూ సప్తసింధువులుగా చెప్పింది. అంతేకాక, సింధు, అసికి నదులలో ఓషధులు, మందులు లభిస్తాయానికూడా ఋగ్వేదంలో ఉన్నది. బైబిల్‌లో ఈ నదిపేరు 'హొద్దు' అని చెప్పబడింది.

సింధునదిలో నీరు కొంచెం గోధుమ వర్ణంగా ఉంటుంది. పూర్వం ఈ నదికి విపరీతంగా వరదలువచ్చి, దేశానికి గొప్ప నష్టం కలుగుతూఉండేది. వరదలవల్ల నదీగమనంకూడా మార్పుచెందుతూవచ్చింది. మార్చినెల నుండి నదిలో నీరు క్రమక్రమంగా పెరుగుతూ, ఆగస్టు నెలవచ్చేటప్పటికి - ఒడ్డులు ఒరుసుకుని పొంగులువారుతూ ప్రవహిస్తుందనీ, మళ్ళీ సెప్టెంబరునుంచి క్రమేపీ నీరు తగ్గిపోతుందనీ చెపుతారు. ఎక్కడెక్కడి ఒండ్రుమట్టి కొట్టుకుని వస్తున్నందున సింధునది ప్రవహించే మైదానం మిక్కిలి సారవంతమై రకరకాలపంటలు పండడానికి అనుకూలంగా ఉన్నది. దీనివలన భారత, పాకిస్థాన్ దేశాలకు కావలసినంత నీటివసతి లభిస్తున్నది. ఈ నది ఎడారిని పంటభూమిగా మార్చింది. సింధునదేకనుక లేకపోతే—సింధురాష్ట్రంకూడా థార్ ఎడారిలా అయిఉండేది ! బ్రిటిషువారికాలంలో ఈ నదికి లెక్కలేనన్ని పంట కాలువలు త్రవ్వారు. పంజాబులోఉన్నన్ని పంటకాలువలు ప్రపంచంలో మరెక్కడా లేవు ! తూర్పుకంటె పడమటి భాగాన అధికంగా పంటకాలువలు,పంటభూములుఉన్నాయి.

మహాభారతకాలంనుంచీ కాలువలసహాయంతో సింధునదీ ప్రాంతాన భూమిని సేద్యంచేసినట్లు తెలుస్తున్నది.

సింధునదికి సుక్కూరువద్ద ఒక పెద్ద ఆనకట్ట కట్టారు. అది 1932 లో ప్రారంభించి—1931 నాటికి పూర్తిగావించబడింది. ఆనకట్ట పొడవు సుమా రొకమైలు. ఏడుకాలువలుకూడా త్రవ్వారు. వీటిమూలంగా సింధు రాష్ట్రంలో 55 లక్షల ఎకరాలభూమికి నీటివసతి లభిస్తున్నది. ప్రపంచంలోని గొప్ప నీటిపారుదలపథకాలలో ఇది ఒకటి. ఇంకా సింధునదిఉపనదులనుండి త్రవ్విన కాలువల మూలంగా తూర్పు పశ్చిమపంజాబులలో లక్షలాది ఎకరాలభూమి సాగుఅవుతున్నది. ఈ పంటకాలువలలో జీలంనదినుండి త్రవ్విన దిగువజీలంకాలువ, సట్లెజ్‌నది నుండి త్రవ్విన సర్‌హింద్‌కాలువ, చీనాబ్‌నదినుండిత్రవ్విన దిగువచీనాబ్‌కాలువ, రావీనదినుండి త్రవ్విన ఎగువ బారిడయొబ్‌కాలువ — ముఖ్యమైనవి. ఎగువజీలం, ఎగువచీనాబ్, దిగువబారిడయొబ్‌కాలువలను కలిపి ఏర్పాటు చేసిన 'ట్రిపెల్ కెనాల్ ప్రాజెక్టు' పాకిస్తాన్‌లోని ముఖ్యమగు నీటిపారుదల పథకాలలో ఒకటిగా ఎంచబడుతున్నది. సట్లెజ్‌నదిపైన తూర్పుపంజాబులో బాక్రావద్ద పెద్ద ఆనకట్ట కట్టారు. సంగర్‌వద్దకూడా మరొక ఆనకట్ట నిర్మించారు. వీటివలన తూర్పు పంజాబ్, రాజస్థాన్ లలో సుమారు 36 లక్షల ఎకరాలభూమి సాగుఅవుతున్నది.

ఒకలక్ష సలభైనాయిగువేల కిలోవాట్ల జలవిద్యుచ్ఛక్తి కూడా లభ్యమవుతున్నది.

సింధునది సింధురాష్ట్రంలో హైదరాబాద్‌వద్ద పాయయిగా చీలి, పెద్ద డెల్టాను ఏర్పరచింది. ఈ డెల్టా ప్రదేశం సుమారు 3 వేల చ. మైళ్ళు. దీని పరీవాహ ప్రదేశం దాదాపు 3,72,700 చ. మైళ్ళు అని అంచనా. సింధునది సింధు రాష్ట్రానికి గొప్ప సంపద. దీనవలన సింధు, పంజాబురాష్ట్రాల్లో వరి, గోధుమ, ప్రత్తి మొదలైనపంటలు పండుతున్నాయి. సింధునది అత్యంత ప్రాచీనమైనదేకాక, గొప్ప పుణ్యనదిగా భావించబడుతున్నది.

సింధునదీప్రాంతానగల హరప్పా, మొహంజొదారో మొదలైన ప్రదేశాలలో అత్యంత ప్రాచీనమైన శిథిలాలు బయల్పడినాయి. వీటివలన సింధునాగరకత (ఇండియా వాలీ సివిలిజేషన్) చాలా పురాతనమైన దని చరిత్రకారులు కనుగొన్నారు. ఆర్యులురాకపూర్వమే సింధునాగరికత ఏర్పడినట్లు ఊహిస్తున్నారు. ఇది క్రీ.పూ. 3750 సం. ల ప్రాంతాన విలసిల్లినట్లు చెపుతున్నారు. క్రీ.శ. 1922లో శ్రీ ఆర్. డి, బెనర్జీ మొహంజొదారోవద్ద ఒక బౌద్ధస్తూపాన్ని, దానిక్రింద కొన్ని శిథిలాలను కనుగొన్నారు. ఇది చాలా ప్రసిద్ధంగా విస్తరిల్లిన నాగరికతగా పరిశోధనలవలన తెలియవచ్చింది. ఇలాంటి నాగరికతనే తెలిపే శిథిలాలు ఇంకా అనేకచోట్ల బయల్పడినాయి. పాకిస్తానులోని పంజాబుకుచెందిన మాంటిగోమేరీజిల్లాలో

హరప్పా అనే పెద్ద గ్రామం ఉన్నది- సింధురాష్ట్రంలోని లార్ఖానాజిల్లాలో మొహంజొదారో ఉన్నది. సింధు నాగరకత సుమారు క్రీ.పూ. 2500——1500 మధ్య కాలం నాటిదని చాలామంది చరిత్రకారులు ఊహిస్తున్నారు. దాదాపు ఇప్పటికి 3,4 వేలసంవత్సరాలక్రింద ఈ ప్రాంతంలో ప్రజలు నివసించినట్లు తెలుస్తున్నది. భవనాలు, స్నానవాటికలు, శ్మశానాలు, సింహద్వారాలు, కణశాలలు, ధాన్యపుకొట్లు——ఎన్నెన్నో పనిముట్లు ఈ ప్రాంతాలలో దొరికాయి. మొహంజొదారోకు సుమారు 80 మైళ్ళ దూరాన చెన్హూదారో అనే పురాతనప్రదేశం ఒకటి బయల్పడింది. హరప్పావద్ద త్రవ్వుతుండగా దాదాపు 57 సమాధులు బయల్పడినాయి. వీటిలో శవాలు ఉత్తరంనుండి దక్షిణానికి పడుకోబెట్టబడి ఉన్నాయి. శవాలమీద ఎన్నోరకాల ఆభరణాలు, గాజులు, హారాలు, రాగిఉంగరాలు, అంటు జోళ్లు, ఇంకా ముస్తాబుచేసుకునే వస్తువులు అనేకం లభ్యమైనాయి. ఎన్నో మట్టిపాత్రలు, కుండలు దొరికాయి. అయితే ఇవన్నీ సింధునాగరకతకు చెందినవికావనీ, తరువాతకాలంనాటివారివనీ తెలుస్తున్నది- సింధునాగరికతకు చెందిన ప్రజలు, చనిపోయినవారిని పూడ్చిపెట్టకుండా దహనంచేసినట్లు చరిత్రకారులు కనుగొన్నారు. ఏమైనప్పటికీ సింధునాగరికత విలసిల్లినకాలంలో వ్యవసాయం, వర్తకంకూడా ఎంతో అభివృద్ధిలోఉన్నట్లు తెలుస్తున్నది. యుద్ధపరికరాలుకూడా అనేకం దొరికాయి. ఆకాలంలో

ప్రజల లిపిని తెలిపే సీళ్లు, బిళ్ళలు, ముద్రలు—అనేకం లభ్యమైనాయి. అయితే ఆ లిపి చదవడానికి సాధ్యంగా లేదు. కుడినుంచి ఎడమకూ, మళ్ళీ ఎడమనుంచి కుడికీ వ్రాసినట్లుగా తెలుస్తున్నది. పయిగా, ఆ లిపి—అక్షరాలతో లేదనీ—చిత్రాలతో ఉన్నదనీ చెపుతున్నారు. దీనిని పండితులనేకులు పరిశోధించారు. మాటలు ఎక్కడ ఎలా ఒత్తిపలకవలసిందీ ఏవో గుర్తులుకూడా ఉన్నాయనీ, ప్రాచీనభారతంలోని బ్రాహ్మీలిపికి ఈ లిపి మాతృకలనీ అంటున్నారు. సింధునాగరికతకుచెందిన ప్రజలు ప్రధానంగా స్త్రీదేవతను కొలిచినట్లూ, పశుపతి లేక శివుని పూజించినట్లూ తెలుస్తున్నది. వీరుకాక ఇంకా చెట్లనూ, జంతువులనూ, రాళ్ళనూ, లింగాలనూ,యోనిచిహ్నాలనూ—ఆకాలపు ప్రజలు పూజించినట్లు పరిశోధనలవలన కనుగొనబడింది. ఈ విషయాలలో పండితుల, చరిత్రకారులమధ్య అనేక అభిప్రాయభేదాలున్నాయి. ఈ నాగరికత క్రీ.పూ. 3250—2750 సంవత్సరాలమధ్యకాలంనాటిదని చాలా మంది అంగీకరిస్తున్నారు. అయితే, సింధునాగరికతకు చెందిన ప్రజలమతం—సంస్కృతి, వేదసంస్కృతికి చెందినదా లేదా అన్న విషయంలోకూడా పరిశోధకులమధ్య భేదాభిప్రాయాలున్నాయి. క్రీ.పూ. 15వ శతాబ్దంలో వేదాలకుచెందిన సంస్కృతి ఉన్నట్లు అనేకులు ఒప్పుకుంటున్నారు. ఇంకా అనేకులు అంతకంటె పూర్వకాలంనాటిదనీ, కొందరేమో ఇంకా ఇటీవలకాలంనాటిదనీ వాదిస్తు

న్నారు. సింధునాగరికత వైదికసంస్కృతిలో ఒకభాగమే అని కొందరంటున్నారు. కాదు, ఋగ్వేదంలో వర్ణించిన అనార్యులసంస్కృతి అని మరికొందరు చెపుతున్నారు. ఏమైనప్పటికీ — సింధునాగరికత, సంస్కృతి — ఒక ప్రత్యేకమైన నాగరికత, సంస్కృతి అనీ—మెసపటోమియన్ నాగరికతతో దాని కెలాటిసంబంధమూ లేదనీ మాత్రం అనేకులు గట్టిగా నమ్ముతున్నారు.

ఆకాలపుప్రజలు కాశ్మీరం, నీలగిరికొండలు, మధ్య ఆసియా, దక్షిణహిందూస్థానం, మైసూరు, ఆఫ్ఘనిస్థాన్ మొదలయిన దేశాలతో విరివిగా వర్తకం చేశారు.

సింధునది గొప్పనదే కాక పుణ్యప్రదమగునది. కరాచీవద్ద—ఈ నది అనేక ముఖద్వారాలగుండా వెళ్ళి అరేబియా సముద్రంలో పడుతున్నది.

# బ్రహ్మపుత్ర

హిందూదేశంలోని నదులలో సింధునదితరవాత పొడవైననది బ్రహ్మపుత్రానది. దీనిపొడవు 1680 మైళ్లు. ఈ నదికూడా సింధు, సట్లెజ్‌నదుల జన్మస్థలాలకు సమీపంలోనే, టిబెట్‌పీఠభూమిలో మానసరోవరానికి దక్షిణాన జన్మిస్తున్నది. త్సాన్‌పో నది అనేపేరుతో కొన్ని వందలమైళ్లు తూర్పుగా ప్రవహిస్తున్నది. తరవాత హిమవత్పర్వతాలతూర్పుకొనవద్ద దక్షిణానికి వంపుతిరిగి-అక్కడనుంచి బ్రహ్మపుత్రానది అనుపేరుతో అస్సాం ఉత్తరభాగాన లోయగుండా పశ్చిమదిశగా ప్రవహిస్తున్నది. ఆ తరవాత గారోకొండలవద్ద మరల దక్షిణదిశగా మళ్ళి, చివరకు గోలందోదగ్గర గంగానదితో కలుస్తున్నది. గోలందో తూర్పు పాకిస్తాన్‌లో ఉన్నది. ఆవిధంగా గంగానదితో కలిసి బంగాళాఖాతంలో పడుతున్నది.

గంగానదిఉపనదులలో బ్రహ్మపుత్రానది ముఖ్యమైనది. గంగా—బ్రహ్మపుత్రా డెల్టాతీరంపొడవు సుమారు 200 మైళ్లు. ఈ డెల్టాతీరంలో క్షారజల అరణ్యాలున్నాయి. వీటిని సుందరవనాలని పిలుస్తారు. బ్రహ్మపుత్రానది నావల రాకపోకలకు చాలా అనుకూలమైనది.

అప్పుడప్పుడు బ్రహ్మపుత్ర పొంగి పెద్ద పెద్ద వరదలు వస్తుంటాయి.

బ్రహ్మపుత్రానది జీవనదులలో ఒకటి. హిమవత్పర్వతాలలో పుట్టినందున గంగా, సింధునదులలాగానే— ఇందులోకూడా కొండలలో మంచుకరిగి పెద్ద ప్రవాహంగా వస్తుంది. మండువేసంగిలోకూడా జలసమృద్ధమై ఉంటుంది.

బ్రహ్మపుత్రానది గొలందోవద్ద గంగతో కలిసిన తరవాతనే డెల్టా ప్రారంభమవుతున్నది. ఇక్కడనుంచి ఈ రెండునదులూ వందలాదిపాయలుగా చీలిపోయి బంగాళాఖాతంలో కలుస్తున్నాయి. చాలాలోతుగా ఒండ్రుమట్టి ఏర్పడిన ఈ విశాలమగు డెల్టా మిక్కిలి సారవంతమైనభూమి. ఇక్కడ జనుము పుష్కలంగా పండుతున్నది. బ్రహ్మపుత్రానదీతీరంఅంతటా దట్టమైన అడవులు క్రూరమృగాలకు నిలయం. అడవులేకాక—అక్కడక్కడ బురదదీవులు ఏర్పడ్డాయి. చిత్తడినేలలు మిక్కుటంగా ఉన్నాయి. బ్రహ్మపుత్రానది ఒడ్డునఉన్న గౌహతి రేవుపట్టణం. ఇక్కడనుండి తేయాకు, కలప మొదలగునవి ఎగుమతిఅవుతున్నాయి.

అస్సాంమధ్యనుండి ప్రవహిస్తున్న ఈ నది మన సంస్కృతవాఙ్మయంలో శ్రీలౌహిత్య అనేపేర ప్రసిద్ధి చెందిఉన్నది. రఘుమహారాజు లౌహిత్యనదిని దాటివస్తుండగా ప్రాగ్జ్యోతిషప్రభువు భయంతో కంపించిపోయాడని కాళిదాసు తన రఘువంశంలో వర్ణించాడు. పూర్వకాలంలో

మహర్షులూ, మునులూ అనేకులు ఈ బ్రహ్మపుత్రానదీ తీరంలో తపస్సుచేసినట్లూ, ఆశ్రమాలు కట్టుకుని ఉన్నట్లూ తెలుస్తున్నది. గంగానదికి ముఖ్యఉపనదిగా ఉంటున్న బ్రహ్మపుత్ర—గొప్ప పుణ్యప్రదమైనదని మన ధర్మ శాస్త్రాలు చెపుతున్నాయి.

బ్రహ్మపుత్రనుగురించిన కథ కాలికా పురాణం ఇలా చెపుతున్నది. పూర్వం ఒకప్పుడు శాంత నవుడు అనే ముని వుండేవాడు. ఆయనభార్యపేరు అమోఘ. ఆమె చాలా చక్కనిది, పతివ్రత. ఒకప్పుడు ఆమెను చూచి బ్రహ్మ మోహించాడు. శాంతనవుడు ఆశ్రమంలో లేని సమయంచూచి అక్కడికి వెళ్లాడు. తనకోర్కె తీర్చ మని అమోఘను ప్రార్థించాడు. కాని అమోఘ మహాపతివ్రత కావటంవలన, బ్రహ్మకోరికను నిరాకరించింది. ఆయన ముఖమయినా చూడక తలుపు వేసుకొని లోపల ఉన్నది. ఈ పని కూడదనీ, మీరుమిక్కిలిగా ప్రవర్తిస్తే శపిస్తాననీ బ్రహ్మతో చెప్పింది. అప్పుడు చిత్తవిభ్రమంపొందిఉన్న బ్రహ్మకు— రేతఃపతనమయింది. తిరిగీ బ్రహ్మ హంస వాహనంఎక్కి అక్కడనుంచి వెళ్ళిపోయాడు. పిమ్మట శాంతనవుడు ఆశ్రమానికి వచ్చాడు. ఆశ్రమంముందు హంసపాదాల గుర్తులుండడం, రేతస్సుపడి ఉండడం చూచాడు. ఏంజరిగిందని భార్యను అడిగాడు. అమోఘ,

బ్రహ్మరావడం, పనహిందుకోరడం—మొదలయిన విషయమంతా చెప్పింది. అంతట శాంతనవుడు, లోకోపకారార్థం ఇలా జరిగిందని తెలుసుకొని—బ్రహ్మవీర్యాన్ని తాను గ్రహించి, దానిని తిరిగీ భార్యగర్భంలో చేర్చాడు. తరువాత అమోఘకు ఒక శిశువు జన్మించింది. ముని ఆ శిశువును పర్వతాలమధ్యలో ఉంచి వచ్చాడు. వెంటనే ఆ శిశువు జలరూపంలో వృద్ధిపొంది ప్రవహించ సాగినది. బ్రహ్మవీర్యంవలన జన్మించినదికనుక ఆ నదికి బ్రహ్మపుత్ర అని పేరువచ్చింది.

తండ్రి ఆజ్ఞచొప్పున తల్లిని వధించిన పరశురాముడు బ్రహ్మపుత్రానదిలో స్నానంచేసి, తనపాతకం పోగొట్టుకున్నట్లు చెపుతారు.

---

# యమున

గంగానదివలెనే అత్యంతప్రాచీనమూ, పవిత్రమూ అయినదే యమునానదీను. ఇది గంగానదికి పశ్చిమంగా, కొంచెందూరంలో—హిమాలయాల్లోని 'యమునోత్రి' అను చోట జన్మించి—సుమారు 1800మైళ్ళదూరం ప్రవహించి, అలహాబాద్‌వద్ద ప్రయాగక్షేత్రంలో గంగానదితో కలిసిపో తున్నది.

యమునానదికి అనేక ఉపనదులున్నాయి. ముఖ్యంగా ఛంబల్, సింద్, బేత్వ, కేన్ అనే నదులు దక్షిణదిశనుంచి వచ్చి, యమునానదిలో కలుస్తున్నాయి. ఈ నదులన్నీకూడా వింధ్యపర్వతాలలో పుట్టినవే. ఇవి మాళవపీఠభూమిగుండా ఉత్తరదిక్కునకు ప్రవహించి యమునతో చేరుతున్నాయి. అయితే, ఈ ఉపనదులలో వేసవికాలంలో అంతగా నీరుం డదు. యమునానదికి ముఖ్యఉపనదిఅగు ఛంబల్‌నది—చిన్న చిన్న ఉపనదులను కలుపుకుని వచ్చి, ఉత్తరప్రదే శ్‌లో ప్రవేశించినపిమ్మట, ఇటావాకు ఆగ్నేయదిశగా సుమారు 25 మైళ్ళదూరంలో యమునానదితో కలుస్తు న్నది.

గంగానదివలెనే యముననుండికూడా అనేక పంట కాలువలు త్రవ్వారు. గంగానదికి హరిద్వారందగ్గరనుంచి త్రవ్విన గంగాకాలువ, నరోరావద్ద త్రవ్విన దిగువ

గంగాకాలువలవల్ల గంగా యమునానదులమధ్య గల భూమి సాగుఅవుతున్నది. శారదకాలువలద్వారా ఉత్తరప్రదేశ్‌లో ఉత్తరభాగంలోని భూములకు నీటివసతి లభిస్తున్నది. పోతే, యమునానదినుండి త్రవ్విన ఆగ్రా కాలువమూలంగా నదికి దక్షిణపుభూమి సాగుఅవుతున్నది. తూర్పుయమునాకాలువవల్ల సహారన్పూరు, బులందషహర్ జిల్లాలలో చక్కగా నీటిపారుదల సౌకర్యం చేకూరు తున్నది. ఇవికాక, యమునానదినుండి పశ్చిమభాగాన త్రవ్విన పశ్చిమయమునాకాలువ, యమునానది ఉపనదుల నుండి త్రవ్వబడిన బేత్వకాలువ మొదలైనవాటిమూలంగా అనేకలక్షల ఎకరాలభూమికి నీటివసతి కలుగుతున్నది.

యమునానది ముఖ్యమగునదులలో ఒకటిగానూ, పవిత్రమైన నదిగానూ ఋగ్వేదం పేర్కొన్నది. భారత, భాగవతాది పురాణాలు యమునానదినిగురించి వర్ణించి చెప్పాయి. గంగవలెనే యమునఒడ్డునకూడా అనేకపుణ్య క్షేత్రాలు, తీర్థాలు వెలసిఉన్నాయి. యమునాతీరంలో పెద్ద పెద్ద పట్టణాలుకూడా అనేకం ఉన్నాయి. యమునానదికి అనేకపేర్లు ఉన్నాయి.

'కాళిన్దీ, సూర్యతనయా, యమునా, శమనస్వసా- అని 4 పేర్లు అమరసింహుడు పేర్కొన్నాడు.

——కళిందపర్వతా జ్ఞాతా కాళిందీః కళిందపర్వతం వలన పుట్టినది కాళింది. సూర్యస్యతనయా, సూర్యతనయాః సూర్యునికూతురు. యమేనసహజాతా యమునాః యము

నదో పుట్టినది కాబట్టి యమున. శమనస్య యమస్య స్వసా- శమనస్వసా = యముని చెల్లెలు కనుక శమనస్వసా—ఈ నాలుగూ యమునానదికి పేర్లు. వీటికిసంబంధించిన పురాణ గాథలు అనేకం ఉన్నాయి.

యమునానదిలో కాళిందిఅను ఒక ప్రసిద్ధమైన మడువు ఉన్నది. దాని సమీపంలో పూర్వం సౌభరి అను ముని తపస్సుచేసుకుంటూ ఉండేవాడు. ఒకనాడు గరుత్మంతుడు వచ్చి, ఆ మడువులోఉండే చేపలను భక్షించాడు. అప్పుడు అందులోఉండే చేపలన్నీ సౌభరిమునిచుట్టూ చేరి, దుఃఖించడం మొదలుపెట్టాయి. మునికి జాలికలిగింది. వాటికి ప్రాణభయంలేకుండా అభయంఇచ్చాడు.ఇహమీదట గరుత్మంతుడు ఈ మడువులో ప్రవేశించినట్లయితే మరణిస్తాడని శాపంపెట్టాడు. ఆ శాపభయంవలన గరుత్మంతుడు ఇహ అక్కడికి రావడం మానేశాడు. తరవాత కద్రువ కుమారుడగు కాళీయుడనే సర్పరాజు—గరుత్మంతునివలన తరుమబడినవాడయి భయంపొందాడు. అతను సౌభరిముని గరుత్మంతునికి ఇచ్చిన శాపంవిషయం తెలుసుకుని, చివరకు కాళిందీమడుగులో ప్రవేశించి,అక్కడదాక్కున్నాడు. కాళీయునివలన మడుగులోనీరంతా విషపూరితమైపోయింది. అనేక జీవరాసులు ఆ నీరు తాగి మరణిస్తూవచ్చాయి. ప్రజలు ఆ మడుగులో దిగడానికే భయపడుతూఉండేవారు. అప్పుడు శ్రీకృష్ణుడు—ఆ మడుగులో దూకి, కాళీయుని పట్టుకున్నాడు. అతనిశిరస్సుపై నాట్యంచేశాడు. కాళీయుని

మర్దించి అతనిగర్వం అణచాడు. గరుత్మంతునివలన భయాన్నిపోగొట్టి అతన్ని—ఆ మడుగు విడిచిపెట్టి రమణకద్వీపానికి వెళ్ళేటట్లు చేశాడు. అప్పటినుంచీ కాళింది జలం మళ్ళీ నిర్మలమై, ప్రజలు తాగడానికి యోగ్యమైంది. సూర్యునిభార్య సంజ్ఞ. ఒకప్పు డామె సూర్యతేజస్సు చూడలేక కళ్లుమూసుకున్నది. అందుకు సూర్యుడు కోపించి—'నీకు నిఖిలజనైకసంయమనుడగు కొడుకు పుట్టగలడు'—అని భార్యకు చెప్పాడు. అందువలన—సూర్యుడికి సంజ్ఞయందు యముడు పుట్టాడు. తరవాత ఆమె, చంచల దృష్టితో భర్తవంక చూచింది. అప్పుడు సూర్యుడు—'నీకు విలోలయగు కుమార్తె జన్మిస్తుంది'—అనిభార్యతో చెప్పాడు. ఆవిధంగా ఆమెకు యమునానది జన్మించింది.

కాళిందీతీరంలో—అనగా యమునాతీరంలో పూర్వకాలంలో మధువనం అనే ఒక గొప్పవనం ఉండేది. దానిని మధువనేవాడు పాలిస్తూ—తనపేర మధురాపురం అనే ఒక పట్టణాన్ని అక్కడ నిర్మించుకున్నాడు. మధువు కుమారుడు లవణుడు. శ్రీరామునితమ్ముడగు శత్రుఘ్నుడు - లవణుని సంహరించి మధురానగరాన్ని తనకుమారులకు అప్పగించాడు. సూర్యవంశం క్షీణించిపోయినపిదప కొంత కాలానికి ఆ పట్టణం యాదవులచేతికి చిక్కింది.

శ్రీకృష్ణునిబాల్యక్రీడలు—ఆ అవతారపురుషుని లీలలు, హరివంశంలోనూ, భాగవతం దశమస్కంధం

లోనూ మనోహరంగా వర్ణించబడినాయి. శ్రీకృష్ణుని జన్మ స్థలమగు మథురానగరం గొప్ప పుణ్యక్షేత్రంగా ప్రసిద్ధి కెక్కింది. ఇక్కడ యమునానదిలో స్నానంచేసినవారు సకలపాపాలనుండీ విముక్తులవుతారని వరాహపురాణం వర్ణించింది.ఏ పుణ్యతీర్థంలోనైనాసరే పాపంచేస్తే దానికి ప్రాయశ్చిత్తంలేదు. కాని యమునాతీరమందలి మథురలో అలా కాదు. అక్కడ పాపంచేసినవారు యమునలో స్నానంచేస్తే వెంటనే ఆ పాపం తొలగిపోతుందని చెపుతారు. మథురవద్ద— యమునాతీరంలో అనేక పుణ్య స్థలాలూ, దేవాలయాలూ, తీర్థఘట్టాలు వెలసిఉన్నట్లు వరాహపురాణం చెప్పింది. యమునాతీరంలో, ఆ మనోజ్ఞ మగు సైకతస్థలాలలో శ్రీకృష్ణుడు ఎన్నెన్నో అద్భుతాలు చేశాడు. ఆయన బాల్యక్రీడలు ఎంతో రమణీయంగావర్ణించి చెప్పాయి పురాణాలు. యమునాతీరంలో విశ్రమఘట్టం అనేది గొప్ప పుణ్యస్థలం. కంసుణ్ణి సంహరించినఅనంత రం శ్రీకృష్ణుడు ఆ ప్రదేశంలో విశ్రమించాడని చెపుతారు. మథురదక్షిణసింహద్వారంవద్ద 'కంసకాతిలా' అను ప్రదేశం చూపి—కంసుడు అక్కడే వధించబడ్డాడని అంటారు. మరొకటి యోగఘట్టం. నందునికుమార్తెయగు యోగమాయను కంసుడు చంపడానికి ప్రయత్నించింది అక్కడేనని చెపుతారు. విశ్రమఘట్టంనుండి అయిదు క్రోసులపరిమితిగల ప్రదేశమంతా గొప్ప పుణ్యస్థలంగా

భావిస్తారు. ముఖ్యంగా కార్తీకశుద్ధ విదియనాడు అక్కడ యమునలో స్నానంచేస్తే గొప్ప పుణ్యం. దానిని 'యమ ద్వితీయ'అని పిలుస్తారు. ఆ తిథినాడు యముడు తన చెల్లెలగు యమునానదిని చూడడానికి వచ్చాడట! ఆమె అన్నగారికి గొప్ప ఆతిథ్యంఇచ్చి సత్కరించినదట! యముడు ప్రీతి చెంది—ఆ తిథినాడు అక్కడ యమునలో ఎవరైతే స్నానంచేస్తారో—వారికి యమలోకదర్శనం ఉండదని వరం ఇచ్చాడట. యమునాతీరంలో అనేక వనాలు, ఉప వనాలు ఉన్నాయి. ఇవన్నీ పురాణగాథలకుసంబంధించిన పుణ్యస్థలాలు. యమునఒడ్డున మరొక పుణ్యస్థలం ధ్రువ ఘట్టం. ఉత్తానపాదుని పుత్రుడూ, గొప్ప హరిభక్తుడూ అయిన ధ్రువుడు ఇక్కడే నారదోపదేశంవలన విష్ణు మూర్తినిగురించి తపస్సుచేసి తరించినట్లు చెపుతారు.

ఒకప్పుడు యమునాతీరంలో జైన, బౌద్ధమతాలు ఎక్కువగా వ్యాప్తిచెందినట్లు తెలుస్తున్నది. హిందూదేవా లయాలతోపాటు మథురలో అనేక బౌద్ధదేవాలయాలూ, జైనదేవాలయాలూ, బౌద్ధస్తూపాలూ, చారిత్రకస్థలాలూ ఉన్నాయి.

మథురకు సుమారు 6మైళ్ళదూరంలో బృందావనం ఉన్నది. బృందావనప్రాంతం అరణ్యప్రదేశం. పూర్వం ఇక్కడ అనేక గొల్లపల్లెలుండేవి. పచ్చికబీళ్ళకూ, పశు

సంపదకూ ప్రసిద్ధికెక్కిన ప్రదేశం ఇది. ఈ ప్రాంతం లోనే గోవర్ధనపర్వతం ఉన్నది. శ్రీకృష్ణుడు, గోపాలకుల తోనూ, గొల్లపశువులతోనూ ఈ ప్రాంతంలో విహరించి- తన మహిమలు చూపాడు. యమునాతీరంలో అర్ధచంద్రా కృతిలో ఏర్పడిఉన్న బృందావనం గొప్ప పుణ్యస్థలంగా ప్రసిద్ధికెక్కింది. బృందావనంవద్ద యమునానది పాయగా చీలి, ఒక పెద్ద వంపుతిరిగింది. దీనికికారణం యిలా చెపుతారు: ఒకప్పుడు, బలరాముడుకూడా కృష్ణుడిలాగానే గోపికలతోకలిసి నృత్యంచేద్దామని యమునాతీరానికి వెళ్ళాడు. కాని, అలవాటులేనందువల్ల బలరాముడికి నాట్యం చేయడం చేతకాలేదు. అదిచూచి యమునానది ఫక్కున నవ్వింది. అందుకు కోపంవచ్చి బలరాముడు తన హలా యుధం (నాగలి) యమునానదిమీదికి విసరి—నదిని లాగాడు.అందువల్లయముననాగటిచాలులాగా పాయలైంది. ఈ కథను మరోరకంగాకూడా చెపుతారు. బలరాముడికి మధురమగు మద్యంఅంటే చాలాఇష్టం. ఒక కదంబ వృక్షంమీద మద్యం తాగి అతను మైమరచి—యమునా నదిలో స్నానంచేయాలనుకున్నాడు. నదిని తనదగ్గరికి రమ్మని పిలిచాడు. కాని యమున రాలేదు. అప్పు డతనికి కోపంవచ్చి తన నాగలితో నదినిపట్టి లాగాడు. అప్పుడు

యమున భయపడి స్త్రీరూపంతో అతనిముందు ప్రత్యక్షమైంది. ఏనీలాదిరత్నాలు బలరాముడికి కానుకగా ఇచ్చి వెళ్ళింది. స్వచ్ఛనీలమణుల్లా ప్రకాశించే యమునానదీ జలాలు అప్పటినుంచీ తెలుపువర్ణంగా మారినట్లు చెపుతారు.

రాధాకృష్ణుల ప్రణయగాథలు జగత్ప్రసిద్ధం. వారిరువురూ యమునాతీరాన బృందావనంలో విహరించారు.

రాధామాధవుల శృంగారం, బృందావనవిహారం, యమునాతీరం, చక్కని ఇసుకభూములు, గోపికలతో కృష్ణుని రాసక్రీడలు—ఇవన్నీ జయదేవమహాకవి తన గీతగోవిందకావ్యంలో అత్యంత మనోజ్ఞంగా వర్ణించాడు.

'ధీరసమీరే యమునాతీరే
వసతివనే వనమాలీ
గోపీపీన పయోధరమర్దన చంచల
కరయుగశాలీ'—

'యమునాతీర వానీర నికుంజే మందమాస్థితం,
ప్రాహప్రేమభరోద్భ్రాంతం మాధవం
రాధికాసఖీ'—

'సముదితమదనే రమణీవదనే చుంబనవలితాధరే
మృగమదతిలకం లిఖతి సపులకం
మృగమివ రజనీకరే
రమతే యమునాపులినవనే
విజయీ మురారిరధునా....'—

అని జయదేవుడు తన అష్టపదులలో గానంచేశాడు.

బృందావనంలో ప్రాచీన దేవాలయాలు అనేకం ఉన్నాయి. ఇప్పు డా ప్రదేశంలో దాదాపు 32 తీర్థఘట్టాలు, వేలాదిగా ఆలయాలూ ఉన్నాయి. యాత్రీకులు పడవమీద కేశిఘట్టంవద్ద యమునానదినిదాటి.బృందావనానికి వెడతారు.

ఇక్కడిప్రదేశాలన్నీ శ్రీకృష్ణుని బాల్యక్రీడలతో సంబంధించిఉన్నాయి. యమునాతీరం, బృందావనం—ఇక్కడగల సమస్తజీవకోటీ శ్రీకృష్ణుని వేణుగానమాధుర్యం గ్రోలి పారవశ్యంచెందింది.

ఉత్తరప్రదేశ్‌లో యమునానదిఒడ్డున కల్పి అను పట్టణం ఉన్నది. కాన్పూరునుంచి సాగర్‌కు వెళ్ళే త్రోవలో ఉన్న దిది. ఈ పట్టణం పుణ్యస్థలమేకాక, గొప్ప చారిత్రకస్థలంకూడా. వేదవ్యాసుడు ఇక్కడే యమునానది మీద జన్మించినట్లు చెపుతారు.

ఒకప్పుడు పరాశరమహర్షి తీర్థయాత్రలుచేస్తూ యమునానదిని దాటడానికి ఈ ప్రదేశానికి వచ్చాడు. అప్పుడక్కడ దాశరాజుకుమార్తెనుగు సత్యవతి (మత్స్యగంధి) అనే చక్కనికన్య యమునానదిలో నావ నడుపుతూఉన్నది. పరాశరుడు ఆమెనుచూచి మోహించాడు. కాని సత్యవతి కన్యకనక తన తల్లిదండ్రుల ఆజ్ఞలేనిదే ఆయనకోర్కె తీర్చలేనని చెప్పింద. అప్పుడు పరాశరుడు-'నీ కన్యాత్వం చెడకుండాచేస్తాను'—అని ఆమెకు అభయమిచ్చాడు. ఆమెశరీరంయొక్క 'దుర్గంధాన్ని పోగొట్టి—యమునా

నదీప్రాంతమంతా చీకటిచేశాడు. ఆ చీకటిలో యమునానది మధ్యగల ఒక ద్వీపంలో సత్యవతితో సంభోగించాడు పరాశరుడు. అప్పు డామెకు ఒకకుమారుడు పుట్టాడు. అతడే వ్యాసుడు. చీకటిలో, యమునానదిలో ఒకదీవిలో జన్మిం చిన కారణాన, అతనికి కృష్ణద్వైపాయనుడనీ, వేదాలు వేరుచేసినందున వేదవ్యాసుడనీ పేర్లు వచ్చాయి. ఆ విధంగా వ్యాసమహర్షి జన్మించినప్రదేశం ఇప్పు డున్న కల్పివద్దనే యమునానదిమీద ఉన్నదని చెపుతారు.

ఢిల్లీ, ఆగ్రా, అలహాబాద్ మొదలగు ప్రసిద్ధమగు పట్టణాలెన్నో యమునానదీతీరాన ఉన్నాయి. ఆగ్రాలోని తాజమహాల్ భవనం ప్రపంచంలోని సుందరదృశ్యాలలో ఒకటిఅని ప్రసిద్ధిపొందింది. భారతదేశానికి రాజధానియగు ఢిల్లీపట్టణం యమునానదిఒడ్డునే ఉన్నది. ఈ ఢిల్లీపట్టణమే పూర్వకాలంలో ఒకభాగం ఇంద్రప్రస్థపురంగానూ, ఒక ప్రదేశం హస్తినాపురంగానూ ప్రసిద్ధికెక్కాయి. హస్తినా పురం కౌరవులకు రాజధానిగా ఉండేది. ఇంద్రప్రస్థపురం పాండవులు నిర్మించుకున్నపట్టణం. ఇక్కడ యమునానది ఒడ్డున ఎన్నో పుణ్యతీర్థాలు ఇప్పటికీ ఉన్నాయి.

యమునానది 24°25' ఉ. అక్షాంశ, 89°50' తూ. రేఖాంశలమీద ఉన్నది. ఇది ప్రాచీనమగు, పుణ్యదాయక మగు గొప్పనది. యమునానదీప్రాంతాన భారత సంస్కృతి, నాగరికతలు ఎంతగానో వికసించినవి.



# సరస్వతి

సరస్వతీనది ఋగ్వేదకాలంనాటిది. ఋగ్వేదం సప్త నదులను ప్రధాననదులుగా పేర్కొన్నది. వాటిలో సరస్వతీ నది ఒకటి. రామాయణ మహాభారతాది ఇతిహాసాలలోనూ అనేకపురాణాలలోనూ సరస్వతీనదిప్రసక్తి వచ్చింది. ఐతే, ఈ నది కొంతకాలానికి కురుక్షేత్రంవద్ద అదృశ్యమైపో యిందని మహాభారతం పేర్కొన్నది. బహుశా, అగ్నిపర్వ తసంబంధమైనదేదో ఉత్పన్నంకావడంవల్ల ఇలా జరిగి ఉండవచ్చు.

సరస్వతీనది హిమాలయాలలో శివాలిక్ పర్వత పంక్తులలోని ప్లక్షప్రస్రవణగిరిమీద పుట్టింది. ఇది గంగా నదికి ముఖ్యఉపనదిగాఉన్నట్లు రామాయణం పేర్కొన్నది. గంగ, యమున, సరస్వతి - ఈ మూడునదులూ ప్రయాగ వద్ద కలుస్తున్నాయి. దీనినే త్రివేణీసంగమం అంటారు. సరస్వతి కురుక్షేత్రంలో అదృశ్యమైపోయి, మళ్ళీ పుష్కర తీర్థంలో ప్రత్యక్షమవుతుంది. ఋగ్వేదంలో అనేకచోట్ల ఈ నది ప్రసక్తి వచ్చింది. సరస్వతి, సరసుతి-అనుపేర్లతో పేర్కొనబడింది.

ఇది చాలా పెద్దనది అనీ, భూకంపాలవల్లా, అగ్ని పర్వత సంబంధమైనకల్లోలాలవల్లా విపరీతంగా కంపించి పోతూ చాలా ఒదుముడుసులతో ప్రవహించినట్లు ఋగ్వే

దంలో వర్ణించబడింది. ప్రాచీనమగు సరస్వతీనది కొంతదూరం పైకి కనుపిస్తూ, మళ్ళీ కొంతలెక్క భూమిపై అదృశ్యమైపోతూ, తిరిగి వేరేచోట్ల ప్రత్యక్షమవుతూ మళ్ళీ అంతలోనే మాయమౌతూ వచ్చిందని కొన్ని పురాణాలలో చెప్పబడింది. అనేకప్రవాహాలూ, నదులూ సరస్వతిఅనుపేరుతో వర్ణితమైనాయి. ఒక ప్రవాహం ఆబూశిఖరంనుంచి ఉత్పన్నమై కచ్ సింధుశాఖవైపు ప్రవహిస్తున్నది. మరొకనది శ్రీకృష్ణుడు అవతారం చాలించిన పుణ్యక్షేత్రమగు ప్రభాసపతనంవద్ద ఉన్నది—ప్రయాగవద్ద సరస్వతీనది అంతర్వాహినియై గంగా, యమునానదులతో కలుస్తున్నది. ఈ నది పైకి కనుపించనందువలన దీనికి అంతర్వాహిని అనుపేరు వచ్చింది.

పుష్కరసరోవరంనుండి బయలుదేరిన సరస్వతీనది లూనీనది (లవణానది)లో కలిసిపోయి, పుష్కరసరస్వతి అను పేరుతో వ్యవహరింపబడుతున్నది. పుష్కరసరోవరం గొప్ప పుణ్యతీర్థం. ఈ తీర్థమహిమను 'పుష్కరమహాత్మ్యం' అను పేరుతో పద్మపురాణం విపులంగా వర్ణించి చెప్పింది. పుష్కరంఅంటే—పద్మం లేక కమలం అని అర్థం, బ్రహ్మదేవునిహస్తాలనుండి పద్మం మూడుచోట్ల భూమిమీద పడింది. ఆ మూడుప్రదేశాలలోనూ మూడు గుంటలు ఏర్పడినాయి, అవిమూడూ పుష్కరసరోవరాలయి—మూడు పుణ్యతీర్థాలుగా వెలిశాయి. ఒకప్పుడు

బ్రహ్మదేవుడు ఒక గొప్ప యజ్ఞం ప్రారంభించాడు. కాని, ఆయనభార్యఅయిన గాయత్రి—యాగం ప్రారంభించే సమయానికి అక్కడికి రాలేదు. అప్పుడు కామధేనువు ముఖంనుండి బయల్పడి, పరిశుద్ధఅయిన గాయత్రిని బ్రహ్మ పెండ్లాడాడు. యజ్ఞం ప్రారంభించారు. కాని శివుడు ఆ యజ్ఞానికి భంగంకలిగించడం మొదలుపెట్టాడు. అప్పుడు బ్రహ్మదేవుడు— 'నీపేరుతో ఒక గొప్ప శివాలయం నిర్మిస్తాను'—అని చెప్పి శంకరుణ్ణి సమాధానపరిచాడు. యజ్ఞానికివచ్చిన బ్రాహ్మణులలో కొందరు దక్షిణాది నుండి వచ్చినవారు—అక్కడ ఒకచోట స్నానంచేశారు. అలా స్నానంచేసినవెంటనే వారి పూర్వపురూపాలుపోయి, చక్కని దివ్యస్వరూపాలు ధరించారు. అందువల్ల ఆ ప్రదేశానికి స్వరూపఘట్టంఅని పేరువచ్చింది. ఆ బ్రాహ్మలను తిరిగి పుష్కరసరోవరంవద్ద మరల ప్రత్యక్షమైన ప్రాచీ సరస్వతీనదిలో స్నానంచెయ్యండని చెప్పాడు బ్రహ్మ. వారు అలాగేచేసి మోక్షంపొందారు. బ్రహ్మదేవుడు యజ్ఞం చేసినట్టిన్నీ, సరస్వతీనది ప్రవహించినట్టిన్నీ—పుష్కర సరోవరం గొప్ప పుణ్యతీర్థంగా ప్రసిద్ధికెక్కింది.

సరస్వతి పూర్వం విష్ణుమూర్తిభార్య. ఆయనకు గంగాదేవి, లక్ష్మీదేవికూడా భార్యలే. ఒకనాడు వీరు ముగ్గురూ భర్తతో ఇష్టాగోష్ఠిజరుపుతూఉండగా గంగాదేవి విష్ణుమూర్తివైపే రెప్పవాల్చకుండా చూడసాగింది.

విష్ణుమూర్తికూడా తక్కిన ఇద్దరుభార్యలనూ వదలిపెట్టి, ఒక్క గంగవైపే చూడసాగాడు. అందుకు సరస్వతికి రోషంవచ్చింది—గంగను తిట్టిపోసింది. దాంతో. గంగకు కోపంవచ్చి—'నీవు నదివైపో'మ్మని సరస్వతినిశపించింది. సరస్వతికూడా గంగకు అదేవిధంగా ప్రతిశాపంఇచ్చింది. ఆకారణంవలన సరస్వతి, గంగ—నదులయి ప్రవహించారు. ఇది బ్రహ్మవైవర్తపురాణంలోని కథ.

బ్రహ్మదేవునివాక్కే సరస్వతి. ఒకప్పుడు శివుని లింగంయొక్క ఆద్యంతాలు ఎక్కడున్నాయో తెలుసుకోడానికని వెళ్ళిన బ్రహ్మ వాటిని కనుక్కోలేక తిరిగి వచ్చేశాడు. కాని, చూచివచ్చానని శివుడితో అబద్ధంపలికాడు. అందుకని శివుడికి కోపంవచ్చింది. 'నీవు నాతో అబద్ధం ఆడావు కాబట్టి, నీ వాక్కుఅయిన సరస్వతి నదిఅయిపోవు గాక!'—అని శపించాడు. ఆవిధంగా సరస్వతి ఒక నది అయింది. ఇది బ్రహ్మాండపురాణంలోని కథ.

బ్రహ్మసరస్సువలన పుట్టినది సరస్వతీనది. పూర్వం ఈ నది బ్రహ్మచేసిన యాగానికీ, నైమిశారణ్యంలో మునులుచేసిన యాగానికీ, అలాగే గయుడు, ఉద్దాలకుడు, వశిష్టుడు — (సప్తతంతువులనే యాగం), బృహస్పతి, మరొకసారి బ్రహ్మ—ఈవిధంగా ఏడుచోట్ల జరిగిన యాగాలకు సుభద్ర, కనకాక్షి, విశాల, సురతన్వ, ఓఘమాల, సువేణి, విమలోదక—అను పేర్లుగల ఏడు

రూపాలతో పోయి, వారివారివలన గౌరవంపొందివచ్చింది. ఆవిధంగా సప్తరూపాలు ధరించడంవల్ల—సరస్వతికి సప్త సారస్వతం అని పేరువచ్చింది.

ఒకప్పుడు విశ్వామిత్రుడు వశిష్ఠుణ్ణి మోసంచేయా లని తలచి, సరస్వతిని ధ్యానించాడు. సరస్వతీనది వశిష్ఠ మహర్షిని తీసుకునివచ్చింది. అప్పుడు విశ్వామిత్రుడు ఆయన్ను వధించడానికి సాధనాలు వెదకుతూఉండగా అంతలోనే సరస్వతీనది పొంగింది. ఆ ప్రవాహంలో వశిష్ఠుడు కొట్టుకొనిపోయాడు. విశ్వామిత్రుడు వచ్చి చూచి—సరస్వతిపై కోపించి 'నీవు శోణితవృ క' మ్మని ఆమెను శపించాడు. ఇది భారతంలో చెప్పినవిషయం.

సరస్వతీనది మనకు పైకి కనుపించకపోయినా, ఇప్పటికీ అంతర్వాహినిగా ప్రవహిస్తున్నదని నమ్ముతారు. గంగా యమునా సరస్వతులు కలిసే త్రివేణీసంగమం అలహాబాద్‌వద్ద ఉన్నది. అది ప్రసిద్ధయాత్రాస్థలం. పవిత్రమగు త్రివేణీసంగమంలో స్నానంచేసినవారికి సర్వపాపాలూ పోతాయని పురాణాలూ, ధర్మశాస్త్రాలూ చెపుతున్నాయి. త్రివేణీయాత్రకు వెళ్ళిన స్త్రీలు రమ జడలు కొంత కత్తిరించి—నదీజలాలలో పడవేస్తారు. త్రివేణీసంగమాన్ని ఓంకారంతో పోలుస్తారు. 'అ' కార 'ఉ' కార 'మ' కారాలు కలిస్తే 'ఓ' అవుతుంది. అదే ప్రణవం. 'అ' కారం సరస్వతి అనీ, 'ఉ' కారం యమున

అనీ, 'మ' కారం గంగ అనీ—ఈ మూటికలయికయే ఓంకారమగు ప్రణవమంత్రం అనీ చెపుతారు.

పూర్వం సరస్వతీనది కురుక్షేత్రంవద్ద 'వినాశన' అను ప్రదేశంలో అదృశ్యమైపోయినట్లు మహాభారతం వర్ణించింది. ఇప్పుడా ప్రాంతంలో ఒకనది ఉన్నది. వరదలువచ్చినప్పుడు అది విస్తరించి మరొక ప్రవాహంలో కలుస్తున్నది. దీనినే ఇప్పుడు గగ్గర్‌నది అని పేర్కొంటున్నారు. సరస్వతీనది అదృశ్యమైన కురుక్షేత్రంలోని 'వినాశన' అను ప్రదేశం పూర్వం గొప్ప పుణ్యస్థలంగాఉండేది. గంగ, యమున, సరస్వతి—ఈ మూడునదులూ ప్రవహించినదేశాన్ని పూర్వకాలంలో మధ్యదేశమని పేర్కొన్నారు. ఈ దేశం ఆర్యులసంస్కృతికీ, నాగరికతకూ కేంద్రంగా ఉండేది. 'వినాశన'—మధ్యదేశానికి తూర్పు సరిహద్దుగా ఉన్నదని మనువు పేర్కొన్నాడు.

చాలా ప్రాచీనకాలంనుండీ కూడా సరస్వతీనదీతీరం ఎక్కడెక్కడి తీర్థయాత్రికులకూ నిలయంగాఉండేది. ముఖ్యంగా కురుక్షేత్రంవద్ద ఎన్నెన్నో యజ్ఞయాగాదిక్రతువులు జరుగుతూ—అది ఒక గొప్ప ధర్మక్షేత్రంగానూ, పుణ్యస్థలంగానూ భాసిస్తూఉండేది. మహాభారతకాలానికి ముందుకూడా అలాగే ఉన్నట్లు తెలుస్తున్నది.

ఋగ్వేదం సరస్వతీనదిని గురించి ప్రసిద్ధంగా వర్ణించిచెప్పింది. సరస్వతీనది చాలా పవిత్రమైనదనీ,

సత్యమూ, మధురమూ అయిన వాక్కును ప్రసాదించేదనీ, పవిత్రమూ, ఉన్నతమూఅయిన భావాలను ఉత్పన్నంచేసేదనీ—వర్ణించింది. ఈ నది సకలవిద్యాప్రదాయిని అగు సరస్వతీదేవిస్వరూపమని భావిస్తూ, ఋగ్వేదం పలువిధాల కీర్తించింది.



# జీలం

పంజాబ్‌నదులని పిలువబడే అయిదునదులలో జీలం నది ఒకటి. వేదవాఙ్మయంలో దీనిపేరు వితస్త. ఋగ్వేదంలో ప్రధానమగు ఏడునదులపేర్లూ, వాటితోపాటు మరో మూడునదులపేర్లూ చెప్పబడ్డాయి. గంగ, యమున, సరస్వతి, శతద్రు (సట్లెజ్‌నది). పరూష్ణి, మరుద్వృధ, అసిక్ని—ఈ ఏడూ ప్రధాననదులు అర్జికీయ, వితస్త (జీలంనది), సుషోమ—ఈ మూడూ తక్కిననదులు. జీలంనదిని గ్రీకులు హైడసపెస్ అనీ, బిడాసపెస్ అనీ చెప్పారు. ముసల్మానులు వెట్, బిబెట్ అనుపేర్లతో పిలిచారు. కాశ్మీరంగుండా వస్తున్న జీలంనదిని జహాంగీరుచక్రవర్తి ఎంతగానో ప్రేమించేవాడట! 'కాశ్మీరంలో ఒకచోట చిన్న ఊటగా బయలుదేరింది జీలంనది. ఈ చలమను వెర్‌నాగ్ అని పిలుస్తారు. ఒకప్పుడు ఆ ప్రదేశంలో ఒక పెద్దపాము తిరుగుతూఉండేది. మా నా నాయనగారు జీవించిఉన్నప్పుడు—ఈ నది పుట్టేచోటును నేను రెండుసార్లు వెళ్లిచూచాను. కాశ్మీరునగరంనుండి సుమారు ఇరవైక్రోసులదూరంలో ఉన్నది ఆ ప్రదేశం. నీటిచలమ అష్టకోణాకృతిలో చాలా రమణీయంగాఉన్నది. నీరు ఎంత నిర్మలంగాఉందో వర్ణించలేను. నీళ్ళలో నల్ల పూస జారవిడిచినాసరే అది అడుక్కువెళ్ళేంతవరకూ

స్పష్టంగా కనుపిస్తూనేఉంటుంది. నీళ్ళలో మనోహరమైన చేపలుకూడా వున్నాయి. నేను సింహాసనం అధిష్టించిన తరవాత ఈ చక్కటిచలమచుట్టూ రాళ్ళుపరవడానికీ, ఒక ఉద్యానవనంవేయించడానికీ ఉత్తర్వులుచేశాను. ప్రవాహం ఉద్యానవనం మధ్యలోగుండా ప్రవహించేటట్లు—ప్రవాహా నికి ఇరువపులా చక్కని అలంకారాలలో ఏర్పాట్లు చేయిం చాను. చుట్టూ సుందరవనాలు ఎన్నో నిర్మించి, భూలోక స్వర్గంగా చేశాను. ఇంతటి మనోహరమైన ప్రదేశంభూమి మీద మరొకటి వున్నదని నే ననుకోను'—అని వర్ణిం చాడు జహంగీరు చక్రవర్తి.

కాశ్మీరు పురాతనగాథలనుబట్టి చూస్తే—ఆదేశం మొదట—సతీసారసం అనుపేరుగల ఒక సరోవరం అని అని తెలుస్తున్నది. ఆ సరోవరంచుట్టూవున్న దేశానికి సతీ దేశం అని పేరు. నీలమతపురాణం ఉమాదేవియొక్క సర్వాంగసుందరమగు దేహమే కాశ్మీరదేశమని చెప్పింది. దివ్యనది అగు వితస్తానది (జీలంనది) హిమవత్పర్వతా లలోపుట్టి — చక్కని సీమంతపంక్తిలా (పాపిటలా) కాశ్మీరంమధ్యగుండా ప్రవహించి దేశాన్ని రెండుభాగాలుగా చేస్తున్నదని వర్ణించింది. గరుడులకూ, నాగులకూ ఆజన్మ విరోధం. నాగరాజగు వాసుకి విష్ణుదేవుని ప్రార్థించి, గరు త్మంతునినుండి ప్రమాదంలేకుండాఉండేటట్లువరంపొందాడు. తన అనుచరులంతా ఈ సతీదేశంలో సురక్షితంగావుండే

టట్లు ఏర్పాటుచేశాడు. నాగులందరికీ నీలనాగుడు రాజయి నాడు. జీలంనది ఉత్పత్తిస్థానమగు వెర్ నాగ్ చలమువద్దనే నివాసం ఏర్పరుచుకున్నాడు. సతీసారసం అనే సరోవర ప్రాంతంలో జలోద్భవుడనే రాక్షసుడుండేవాడనీ, అతడు నాగులనూ, మానవులనూ కూడా చంపుతూ వచ్చాడనీ నీల మతపురాణంలో వున్నది. అప్పుడు రాజగు నీలనాగుడు కశ్యపమహర్షిసహాయంతో విష్ణుమూర్తిని ప్రార్థించి మెప్పించాడు. అంతట విష్ణుదేవుడు ఒక ఉపాయం చెప్పాడు. అనంతనాగుని, ఆ చుట్టుప్రక్కలవున్న కొండలన్నింటినీ కాటువేసి రంధ్రాలుచెయ్యమని ఆజ్ఞాపించాడు. అలాచేస్తే సతీసారసంలోని నీరంతా కొండ రంధ్రాలగుండా ఇవతలికి వచ్చేస్తుందనీ. అప్పుడు సరోవరం ఎండిపోవడంవలన, జలోద్భవుడు బయటపడతాడనీ, వాణ్ణి సులభంగా చంప వచ్చుననీ చెప్పాడు. ఆ ప్రకారంగానే జలోద్భవుడనే రాక్ష సుణ్ణి సంహరించడం జరిగింది.

ఉమ లేక సతీదేవి వితస్తానదియై (జీలం) ప్రవ హించింది. కాశ్మీరదేశంయావత్తూకూడా చాలా పవిత్ర మగుదేశమని మహాభారతం,అరణ్యపర్వంలో చెప్పబడింది. వితస్తానదిని బౌద్ధులు వితంషానదియని పేర్కొన్నారు. కాశ్మీరుదేశానికీ కశ్యపమహర్షికీ చాలా దగ్గరి సంబంధం వున్నది. అంతేకాదు, విష్ణుమూర్తి దశావతారాలలోని మత్స్యావతార, వరహావతార—కథలు కాశ్మీరానికి సంబం

ధించి వున్నాయి. కాశ్మీరంలోనే విష్ణువు మత్స్యావతారం ఎత్తాడు. ఆవిధంగా జలప్రళయంరాగా—దుర్గాదేవి ఒక నావఅయి - సమస్త జీవరాసులనూ అందులోకి చేర్చి రక్షించింది. ఆ నావ పీర్‌పంట్సల్ పర్వతపంక్తులలో వున్న బనహాలె కనుమ పశ్చిమభాగాన ప్రయాణంచేసింది. అందువల్లనే అక్కడ—నావబంధనతీర్థం అనే మంచుశిఖరం ప్రసిద్ధికెక్కింది. చాలా ఎత్తయిన కొండశిఖరం అది. శ్రీనగర్‌కు సుమారు 32 మైళ్ళదూరంలో—జీలంనది దక్షిణతీరాన—బారమూల అనే పుణ్యస్థలం వున్నది. దానినే వరాహమూలమనీ, సూకరక్షేత్రమనీ పిలుస్తారు. విష్ణుమూర్తి వరహావతారం ఎత్తింది అక్కడేనట!

జీలంనది వుత్పత్తిస్థానమగు వెర్‌నాగ్‌చలములో నీళ్ళు బాగా ముదిరిన నీలివర్ణంలో వుంటాయి. అడపర్, బ్రింగ్, సంద్రన్ మొదలగు అనేక ప్రవాహాలు వచ్చి ఖానబల్‌వద్ద జీలంనదితో కలుస్తున్నాయి. అక్కడనుండి బారమూలవరకూ—అంటే దాదాపు 102 మైళ్ళు - నదిలో నావలరాకపోకలకు అనుకూలంగా వుంటున్నది. కాశ్మీరుకు ముఖ్యపట్టణమగు శ్రీనగర్ జీలంనదిమీదనేవున్నది. కల్హణకవి రచించిన రాజతరంగిణిలో దీనిపేరు శ్రీనగరి అని చెప్పబడింది. ఈ పట్టణాన్ని అశోకచక్రవర్తి నిర్మించాడనీ ఆకాలంలో 96 లక్షలగృహాలు పట్టణంలో వున్నాయనీ తెలుస్తున్నది. మొదటి ప్రవరసేనుడు, ప్రవరేశ్వరాలయాన్నీ, రెండవప్రవరసేనుడు 6 వ శతాబ్దంలో క్రొత్త

రాజధాని నగరాన్ని నిర్మించాడనీ చెపుతారు. నీళ్ళమీద తేలిపోయే వుద్యానవనాలతో వున్న ప్రసిద్ధమగు దాల్ సరస్సు శ్రీనగర్ ఈశాన్యదిశన నెలకొనివున్నది. ఇంకా ఎన్నెన్నో మనోహరమగు పరిసరాలతో కూడుకునివున్నది ఆప్రదేశం. ఇంకా జహంగీరు నిర్మించిన షాలిమార్‌బాగ్, అక్బరు నిర్మించిన నశీంబాగ్ - ముఖ్యంగా చూడవలసిన స్థలాలు.

తరవాత జీలంనది ఊలార్ సరస్సులో ప్రవేశిస్తుంది. ఈ సరస్సును మహాపద్మసరోవరం అని పిలుస్తారు. దీనికి ఉల్లోలా అనేపేరుకూడా వున్నది. బౌద్ధులు దీనిని ఆరావాలో అంటారు. ఊలార్‌సరస్సు చాలా పెద్దసరస్సుగా పేరుపొందింది. ఈ సరస్సులో ప్రవేశించేముందు సింద్‌అను ఒకవుపనది వచ్చి జీలంనదితో కలుస్తున్నది. నది అనేకవంపులుతిరిగి ప్రవహించడంవలన, నదీవేగం అదుపులోనికి వచ్చింది. ముందుగా లిడ్డర్‌లోయినుంచి వచ్చే లిడ్డర్ అనేనది జీలంనదితో కలుస్తున్నది. తరవాత షాదిపూర్‌వద్ద సింద్‌నదివచ్చి చేరుతున్నది. ఊలార్‌సరస్సు దాటినతరవాత పొహ్రూఅనే మరోనది వచ్చి కలుస్తున్నది. ఎడమవైపునుంచి ఏషవ్, రెంబియారా, రాంపీ, దుడ్‌గంగా, సుఖ్‌నాగ్—అను చిన్నచిన్న వుపనదులన్నీ వచ్చి జీలంనదిలో చేరిపోతున్నాయి. కాశ్మీరుదేశంలలో ఒకచోటనుంచి ఒకచోటికి పోవలసినసామానులు అయితేనేమి,

దేశంలో జరిగే వర్తకంఅయితేనేమీ - అంతా జీలంనది ద్వారానే జరుగుతున్నది. రకరకాల చిన్నచిన్న పడవల మీదనూ, నావలమీదనూ వస్తువుల ఎగుమతి దిగుమతులు కొనసాగుతున్నాయి. పంచనదం అనుపేరుగల పంజాబు నదులు అయిదున్నూ చివరకు సింధునదితో కలిసిపోతు న్నాయి. చీనాబ్, బియాస్, రావి, సట్లెజ్ - అను నాలుగు నదులకూ పశ్చిమదిశగానూ, సింధునదికి ప్రక్కగానే తూరుపుదిశగానూ వున్నది జీలంనది. చివరకి నది 31°-11' ఉ. అక్షాంశ, 72°-12' తూ. రేఖాంశలమీద నున్న త్రిమ్మూఅనుచోట - చీనాబ్‌నదితో చేరిపోతున్నది. ఈ విధంగా జీలంనది మొత్తంపొడవు సుమారు 450 మైళ్లు. జీలం, చీనాబ్‌నదులమధ్యనున్నదేశానికి చాచ్ డయోబ్ అని పేరు. శ్రీనగర్, జీలం, పిండ్‌దడన్‌ఖాన్, మియానీ, బెహరా, కుషాబ్——ఇవి-జీలంనదిఒడ్డునవున్న ముఖ్యపట్టణాలు. జీలంనదిఒడ్డుననే గ్రీకురాజగు అలెగ్జాం డరుచక్రవర్తికీ, హిందూరాజగు పురుషోత్తముడికీ గొప్ప యుద్ధంజరిగింది. అలెగ్జాండరు క్రీ.పూ. 327 లో హిందూ దేశంపై దండెత్తివచ్చాడు. వాయువ్య సరిహద్దున వున్న అనేకదేశాలు జయించి, క్రీ. పూ. 326 లో, ఒహింద్‌వద్ద సింధునదిని దాటివచ్చాడు. ఆ సమయంలో సింధు, జీలం నదులమధ్యదేశమగు తక్షశిలరాజ్యాన్ని అంభి అను రాజు పాలిస్తున్నాడు. ఆ రాజ్యంప్రక్కనే - జీలం, చీనాబ్‌నదుల

మధ్యనున్న దేశాన్ని పురుషోత్తముడనే రాజు పరిపాలిస్తున్నాడు. తక్షశిలను పాలించే అంభి అలెగ్జాండరుకు లొంగాడు కాని, పురుషోత్తముడుమాత్రం లొంగలేదు. అతను మహావీరుడు. పౌరుషశాలి—తన బలాలను పోగుచేసుకుని జీలంనది ఉత్తరపుఒడ్డున అలెగ్జాండరును ఎదిరించడానికి సంసిద్ధుడైనాడు. అలెగ్జాండరు తన సైన్యాలతో క్రీ. పూ. 326 మే నెలలో జీలంనదిదక్షిణపుటొడ్డుకు చేరుకున్నాడు. కాని అప్పుడు జీలంనది—వరదలతో పొంగి ప్రవహిస్తున్నందున, అతను సైన్యాలతో నదిని దాటడానికి సాధ్యంకాలేదు. కొన్నివారాలు ఆలాగే కనిపెట్టుకునివుండి, చివరకు ఒకనాటిరాత్రి అతికష్టంమీద జీలంనదిని దాటాడు. అయితే, పురుషోత్తముడు ఇవతలఒడ్డునుంచి—అలెగ్జాండరును తీవ్రంగా ఎదుర్కొని గొప్పపోరాటం సాగించాడు. ఈ యుద్ధమే జీలంయుద్ధమని చరిత్రలో ప్రసిద్ధికెక్కింది. అంతటి మహాసైన్యంతోవచ్చిన గ్రీకుచక్రవర్తిని ఎదిరించి వీరవిక్రమంతో విజృంభించి భయంకరంగా యుద్ధంచేశాడు పురుషోత్తముడు. కాని చివరకు శత్రువులకు ఖైదీగా చిక్కాడు. అయినప్పటికీ అతను శత్రువులకు తలఒగ్గలేదు. అలెగ్జాండరుచక్రవర్తి —అతని వీరపరాక్రమానికి మెచ్చుకున్నాడు. 'నిన్ను ఎలా చూడమంటావు?'—అని అడిగాడు. అందుకు పురుషోత్తముడు ఏమాత్రం జంకకుండా 'సాటిరాజువలె చూడండి!'—అని బదులుచెప్పాడు. అలె

గ్జాండరు పురుషోత్తముడి ధైర్యసాహసాలకు ఆశ్చర్య పోయాడు. తిరిగి అతని రాజ్యాన్ని అతనికే వదలివేసి వెళ్ళాడు. అలెగ్జాండరు రావి, బియాస్‌నదులుకూడా దాటి, అక్కడున్న రాజులను జయించాడు. కాని పరిస్థితులు అనుకూలంగాలేక హిందూదేశంలో తన సామ్రాజ్యం స్థాపించలేకపోయాడు. జీలంజిల్లాలోని జలాల్‌పూర్‌వద్ద ఒకచోట- అలెగ్జాండరుచక్రవర్తి జీలంనది దాటాడనీ, అక్కడ పురుషోత్తముడు అతన్ని ఎదుర్కొన్నాడనీ జనరల్ కన్నింగ్‌హామ్ తెలియచేస్తున్నాడు.

పంజాబునదులని చెప్పబడే అయిదునదుల్లోనూ, జీలంనదిలో ఎక్కువగా చేపలు, మొసళ్ళు ఉన్నాయి. కాశ్మీరుగుండా ప్రవహిస్తున్న జీలంనది, ఒక చక్కని లోయకుండా ప్రవహిస్తున్నది. దీనినే కాశ్మీరులోయ అంటారు. ఈ లోయపొడవు సుమారు 80 మైళ్ళు, వెడల్పు 20 మైళ్ళు. మంచుకొండలమధ్యనవున్న కాశ్మీరులోయ ఎండపొడలో చూస్తే చిత్రవిచిత్రమగు రంగులతో కనుపిస్తుంది. అత్యంత రమణీయమగు ఈ లోయ ప్రకృతి సౌందర్యంతో శోభిల్లుతూ, భూలోకస్వర్గమని ప్రసిద్ధికెక్కింది. ఈ లోయలోని మనోహరదృశ్యాలు చూచి మొగలు చక్రవర్తులు ముగ్ధులైపోయేవారు. అక్బరుచక్రవర్తి ఒకమాటు ఈ సుందరదృశ్యాలు తిలకించి — మైమరచిపోయి లోయలోదూకాడని చెపుతారు!

జీలంనదికి ఇరుదరులా శ్రీనగరు నిర్మించారు. జీలంనదిమీదా, దానినుండి తీసిన కాలువలమీదా పడవలు నగరంలోనే ఒకచోటనుంచి ఒకచోటికి తిరుగుతుంటాయి. జీలంనది కాశ్మీరుదేశానికి గొప్ప సంపద. నదిప్రవహించే కాశ్మీరులోయ మిక్కిలి సారవంతమైనది. అక్కడ గోధుమ, బార్లీ మొదలగుపంటలు పండుతున్నాయి. లోయ అంతటా ఆపిల్, దానిమ్మ, ద్రాక్ష, పీచ్ - మొదలగు పండ్లతోటలూ, రకరకాల పూలతోటలూ నిండివున్నాయి. పర్వతమయమగు కాశ్మీరులో వ్యవసాయం తక్కువ. అక్కడిప్రజలు గొర్రెలనూ, మేకలనూ పెంచి, ఉన్ని తీయడం ముఖ్యవృత్తి. ఉన్నివస్త్రాలకు కాశ్మీరం ప్రపంచ ప్రఖ్యాతిపొందింది. కాశ్మీరుకు రాజధానిగా జీలంనదిమీద ఉన్న శ్రీనగరునుండి పట్టువస్త్రాలూ, కంబళ్ళూ ఎరివిగా ఎగుమతిఅవుతాయి.

జీలంనదినుండి త్రవ్విన దిగువజీలంకాలువక్రింద అనేకఎకరాల భూమి సాగుఅవుతున్నది. ఎగువజీలం, ఎగువచీనాబ్, దిగువబారిడయొబ్‌కాలువలు — మూటినీ కలిపి ట్రిపిల్‌కెనాల్ ప్రాజెక్టును నిర్మించారు.

వేదవాఙ్మయంలో వితస్తానది అని పేరుగాంచిన జీలంనదీతీరాన కాశ్మీరుసంస్కృతి వృద్ధిపొందింది.





# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA116B161 |
| పుస్తకం పేరు | మన పదులు 01 |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 65 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | ,64, 4 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Rohith |
| పేజీలు విడదీసినది | Sowmya |
| స్కాన్ చేసినది | S.Lak[illegible] |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |